# ప్రబుద్ధాంధ్ర

సచిత్రమాసపత్రిక




విడిసంచిక రెండు అణాలు ౬ ౧౧ సంపాదకుడు

సంవత్సర చందా రూపాయి [illegible]

# విరాళములు

సంవత్సరచందాలవల్ల మాత్రమే ప్రబుద్ధాంధ్రను నిర్వహించడం చాలా కష్టంగా వుంది. ఈసంగతి గమనించి, ఆంధ్రజాతీయవికాసం కోసం ఉత్కంఠులై వున్న ఔదార్యవంతులు ఉత్సాహపరిమితాలైన విరాళాలు దయచేస్తూ మాకు చాలా ఆసరా అవుతున్నారు. అలాంటివా రింకా యెందరో వున్నారు. వారి సాయాని కెదురు చూస్తున్నాము.

ఈనెలలో ప్రబుద్ధాంధ్రను సత్కరించినవారు:—

౧. స్థానం నరసింహారావుగారు, తెనాలి

మొదటి వాయిదా ౧౦–౦–౦

౨. కే. వేంకటాద్రిగారు, తెనాలి

మునిసిపల్ కమిషనరు, తిరుపతి ౫–౦–౦

---

# అభ్రకభస్మము

ఇది శరీరదార్ఢ్యము, వీర్యవృద్ధి, బుద్ధిసూక్ష్మత కలిగించును. క్షయ, ప్రమేహములు హరించును. మధుమేహమునకు ప్రత్యేకౌషధము. దగ్గు, తాపము తగ్గించును. అనుపానభేదములతో అనేక రోగములకు వాడవచ్చును. తులము ౨–౦–౦

# లోహభస్మము

రక్తవృద్ధి, బలము, తేజస్సు కలిగించును. ఉబ్బు, (వంటి) పాండువు, అస్థిర, శూల, అజీర్ణము, గుల్మవ్యాధులు తగ్గించును. అనుపానభేదములతో అనేక రోగములమీద వాడవచ్చును తు, రు ౪

గంధర్వఫార్మసీ, ఇన్నీసుపేట, రాజమండ్రి.

---

# చరకసంహిత

చికిత్సాస్థానము మాచే ఇదివరకు ఆంధ్రీకరింపబడి యిపుడు ద్వితీయ ముద్రణమగుచున్నది. మిగిలిన ఆరు స్థానములను ఆంధ్రీకరించి, స్థానషట్కమనే పేరుతో ఒకే పుస్తకరూపమున ప్రచురించితిమి. గ్రంథములన్నియు కొలదిదినముల క్రిందటనే తయారైనవి. వెంటనే ఆర్డరిచ్చువారికి తగినసౌకర్యముగా లభింపగలవు. చరకసంహిత నంతను నేనే పూర్తిగా ఆంధ్రీకరింపదలచి మిగిలిన సూత్రస్థానమునుగూడ ఆంధ్రీకరించి కొద్దిరోజులలోనే ప్రచురింపబోవు చున్నాడను. గ్రంథము పూర్తి కాకుండా ఆర్డరిచ్చువారికి తగుసౌకర్యములతో లభింపగలదని అందరికి తెలిసిన విషయమే. మా యితరపుస్తకములును, మా 250 రకముల మందులును ఎల్లప్పుడును సిద్ధముగా నుండును.

# ఆధునికాంధ్రవాఙ్మయం—తరవాయి

| | | | |
|---|---|---|---|
| **నరహరిశెట్టి వెంకటరత్నంగారివి** | | | |
| ఆంధ్రహృదయము | ౦ | ౮ | ౦ |
| **మంగిపూడి వేంకటశర్మగారివి** | | | |
| పుట్టుకత | ౦ | ౮ | ౦ |
| నిరుద్ధభారతము | ౦ | ౬ | ౦ |
| శాలివితంతువిలాపము | ౦ | ౬ | ౦ |
| భీష్మునిచరిత్ర | ౦ | ౧౨ | ౦ |
| సాధుసంజీవనము | ౦ | ౮ | ౦ |
| కోయిలపాటలు | ౦ | ౬ | ౦ |
| వీరమతి నాటకం | ౦ | ౧౨ | ౦ |
| సహకారవిజయం | ౦ | ౧౨ | ౦ |
| **కర్లపాలెం కృష్ణారావుగారివి** | | | |
| వివేకానంద నాటకము | ౦ | ౧౨ | ౦ |
| మల్లెపూలు | ౦ | ౧౨ | ౦ |
| వ్యాసమంజరి | ౦ | ౧౨ | ౦ |
| ఆంధ్రదేశము మొదటిభాగం } (యునివర్సిటీ | ౦ | ౧౨ | ౦ |
| ఆంధ్రదేశము మొదటిభాగం } పోటీకి వెళ్లిన నవల) | ౦ | ౧౨ | ౦ |
| **పెనుమర్తి వేంకటరత్నంగారివి** | | | |
| రత్నాపణము (ఖండకావ్యాలు) | ౦ | ౮ | ౦ |
| **త్రిపురనేని రామస్వామిచౌదరిగారివి** | | | |
| సూతపురాణము ద్వితీయాశ్వాసము | ౧ | ౦ | ౦ |
| సూతపురాణము ద్వితీయాశ్వాసము | ౧ | ౦ | ౦ |
| సూతపురాణము చతుర్థాశ్వాసము | ౧ | ౦ | ౦ |
| కురుక్షేత్ర సంగ్రామము | ౧ | ౦ | ౦ |
| శంబుకవధ (ఉత్తరరామచరిత్ర) | ౦ | ౧౨ | ౦ |
| కుప్పుసామిశతకము | ౦ | ౨ | ౦ |
| వివాహవిధి | ౦ | ౧ | ౦ |
| **ఆంధ్ర శేషగిరిరావుగారివి** | | | |
| కేయూరబాహు చరిత్రము (వచనము) | ౦ | ౮ | ౦ |
| **బొడ్డు బాపిరాజుగారివి** | | | |
| విపంచి (ఖండకావ్య సంపుటి) | ౦ | ౪ | ౦ |
| **వివేకవర్ధనీ గ్రంథమాలవారివి** | | | |
| మధుమురళి (ఉమర్ ఖయ్యాం) | ౦ | ౧౨ | ౦ |
| అంపశయ్య (నాటకము) | ౧ | ౦ | ౦ |
| పాండవాంకురము (నాటకము) | ౧ | ౦ | ౦ |
| **వేకుమళ్ల అచ్యుతరావుగారివి** | | | |
| విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము | ౨ | ౦ | ౦ |
| **విశ్వసాహిత్యమాలవారివి** | | | |
| లియో టాల్‌స్టాయి | ౦ | ౩ | ౦ |

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము




జీవామృతము బలహీనతవలన జనించు రుగ్మతలను ఆటంకపరచి, దేహమునకు సంపూర్ణ ఆరోగ్యమును, రక్తవృద్ధి, నరములకు పటుత్వము, కండపుష్టిని, భీమబలమును, తేజస్సును, జ్ఞాపకశక్తిని వృద్ధిపరచును.

జీ వా మృ త ము

ఆరోగ్యమును పునఃప్రతిష్ఠింపగల ప్రాణదాత

---

# బాలభాస్కర

బిడ్డల

లివర్ & స్ప్లీన్

వ్యాధులకును, ఇతర ఉదరసంబంధమైన వ్యాధులకు సిద్ధౌషధము.

వ్యాధుల వివరములు తెలిపిన మంచి సలహా లొసగబడును.

క్యాటలాగు కోరువారికి ఉచితము.

ఆ యు ర్వే దా శ్ర మ ము

పోస్టుబాక్సు 287, మదరాసు.



# బెజవాడ సరస్వతీ బుక్ డిపోవారి, స్వంత ప్రచురణములు

## ఆంధ్రదేశమందు ప్రదర్శింపబడు నాటకరత్నములు

| | రు. | అ. |
|---|---|---|
| సతీ సక్కుబాయి సో॥ రా॥ | 0 | 12 |
| శ్రీ కృష్ణతులాభారము ము॥ సు॥ | 1 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ ల॥ | 1 | 0 |
| బుద్ధిమతీ విలాసము డిటో | 1 | 0 |
| రంగూన్ రౌడీ సో॥ రా॥ | 1 | 0 |
| ధరణికోట డిటో | 1 | 4 |
| సతీ అనసూయ డిటో | 1 | 0 |
| గంగావతరణము డిటో | 1 | 0 |
| మహాభక్తవిజయము డిటో | 1 | 0 |
| ద్రౌపదీ వస్త్రాపహరణం ము॥ అ॥ | 1 | 0 |
| సావిత్రి శ్రీ॥ స॥ | 1 | 0 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 0 |
| మధుసేవ డిటో | 1 | 0 |
| పత్నిప్రతాప్ అనసూయ సో॥ అ॥ | 1 | 0 |
| రాధాకృష్ణ పా॥ ల॥ | 0 | 12 |
| పాదుకాపట్టాభిషేకము పా॥ ల॥ | 1 | 4 |
| జయంతజయపాలము ఆ॥ స॥ | 0 | 12 |
| కృష్ణలీల బళ్లారి కె॥ సు॥ | 1 | 4 |
| రామదాసు డి॥ గో॥ | 1 | 0 |
| రసపుత్రవిజయం ఇ॥ య॥ | 1 | 0 |
| రాణాప్రతాప్‌సింగు డిటో | 1 | 0 |
| చంద్రగుప్త సం॥ శి॥ | 1 | 0 |
| దుర్గాదాసు జం॥ శి॥ | 1 | 4 |
| రాణాప్రతాప్‌సింహా డిటో | 1 | 0 |
| రాధాకృష్ణ సాంగ్సు చం॥ శే॥ | 0 | 12 |
| తులాభారం సాంగ్సు డిటో | 0 | 12 |
| చండీనాటకం ము॥ వే॥ | 1 | 0 |

## ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథలు.

| | రు. | అ. |
|---|---|---|
| జానకీ శపథము | 1 | 0 |
| రుక్మిణీకల్యాణము | 0 | 12 |
| మార్కండేయ చరిత్రము | 0 | 12 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| అంబరీష చరిత్రము | 0 | 8 |
| ప్రహ్లాద చరిత్రము | 0 | 8 |
| గజేంద్రమోక్షము | 0 | 8 |
| భీష్మచరిత్రము | 0 | 8 |
| పైన వుదహరించిన 8 పుస్తకములు కలసిన క్యాలికో బయిండు. | 5 | 8 |

## బి. బాలాజీదాసుగారిచే రచియింపబడిన హరికథలు

| | రు. | అ. |
|---|---|---|
| గయోపాఖ్యానం | 0 | 8 |
| జయప్రదాదేవి చరిత్ర | 0 | 8 |
| నలచరిత్రము | 0 | 8 |
| రుక్మాంగదచరిత్రము | 0 | 8 |
| కుశలవ విజయము | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 1 | 0 |
| దయాకర విజయము | 0 | 8 |
| త్రిశంకు విజయము | 0 | 8 |
| సీతాకల్యాణము | 0 | 8 |
| ద్రౌపదీ మానసంరక్షణం | 0 | 6 |
| కుచేలోపాఖ్యానం | 0 | 6 |
| పురందరదాసు చరిత్ర | 0 | 6 |
| హరికథాగానమంజరి పా 1 | 0 | 6 |
| డిటో రెండవభాగము | 0 | 6 |

మా వద్ద అనేకరకములు గలవు. కోరినవారికి నూరుపేజీల కేట్లాగు ఉచితముగా పంపబడును.

వలయువారు :

కురికూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# ఆధునికాంధ్ర వాఙ్మయం—తరవాయి

**నాళం కృష్ణారావుగారివి** రూ. అ.

- తేనెచినుకులు ౦ ౮
- పాలతరగలు ౦ ౮
- గోగీతము ౦ ౨
- పైడిపేడి ౦ ౨
- ముద్దు ౦ ౪

**పూజాపుష్పమాలవారివి**

- చాకిరేవు ౦ ౮
- కావ్యబిందువు ౦ ౮

**రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారివి**

- వ్యాససంగ్రహం ౩ ౮
- గద్యచింతామణి ౧ ౮
- బాలకవిశరణ్యము ౧ ౮
- వ్యాసావళి ౧ ౦
- ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము ౧ ౦

**వ్యాసకుటీరంవారివి**

- జన్మభూమి నాటిక ౦ ౪
- ప్రేమాంజలి పంచమదంపతులచరిత్రం ౦ ౫
- శుభోదయము ౦ ౩
- శ్రీ వివేకానంద సందేశము ౦ ౨
- కుసుమాకరము ౦ ౧౪
- తూలిక ౦ ౧౦
- ఆత్మజ్యోతి ౦ ౮
- సంధ్య ౦ ౬

**ఉన్నవ లక్ష్మీనారాయణగారివి**

- మాలపల్లి ౩ ౦
- నాయకురాలు ౧ ౦
- సంగీతనాపసాని ౦ ౧
- సోది ౦ ౧
- భావతరంగాలు ౦ ౧
- హరిజన నాటకము ౦ ౧

**వజ్ఝల వేంకటేశ్వరకవిగారివి**

- నాకాభంగము ౦ ౧౨

**గోల్కొండ పత్రిక వారివి**

- గోల్కొండకవుల సంచిక ౨ ౦
- ఉచ్ఛల విషాదము ౦ ౧౨
- రెడ్డికులనిర్ణయచంద్రిక ౧ ౪
- సంఘోద్ధరణము ౦ ౬
- కర్నూలు రాజవంశావళి ౦ ౨
- ర[illegible]శాఫ్ ౦ ౧ ౬

**మ[illegible]రేమండ రామారావుగారివి**

- నా[illegible]య విద్యాచరిత్రము ౦ ౧౨
- శ్రీమధ్వాచార్యులవారి చరిత్ర ౧ ౦

**భావరాజు వేంకటకృష్ణారావుగారివి**

- విదేశయాత్రికులు_ప్రాచీనాంధ్ర దేశము ౧ ౪
- ప్రాచీనాంధ్రనౌకాజీవనచారిత్రం ౧ ౦

**కవితాసమితి వారివి**

- వైశాఖి—వార్షికసంచిక ౧ ౦
- ఊర్మిళ—అపరనము నాటకం ౦ ౧౨
- ప్రభవ—ఖండకావ్యాలు ౦ ౮
- మాతృపూజ పద్యఖండాలు ౦ ౪

**స్థానాపతి రుక్మిణమ్మగారివి**

- పూలమాల—ఖండకావ్యాలు ౦ ౪

**ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారివి**

- వ్యాసావళి ౦ ౪
- తెనుగు వీణ, పాటలు_పద్యాలు ౦ ౨

**కూచి నరసింహంగారివి**

- ఆత్మసంయమము_అమితవిషయాసక్తి ౦ ౬
- అనుబంధము ౦ ౩

**నడింపల్లి వేంకటహనుమంతరావుగారివి**

- పావనిక—నవల ౧ ౦

**సహదేవ సూర్యప్రకాశ రావుగారివి**

- మునిమాపు ౦ ౧౨
- వకుళమాల ౦ ౧౨

**కొ. స్వర్ణవల్లిగారివి**

- వినోదశిల్పము ౧ ౪

**ఆంధ్రరత్న గ్రంథమాలవారివి**

- సుందరి ౧ ౦

**మద్దూరిపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి**

- చతుర్దశమనుచరిత్ర ౦ ౮
- సుభాషితములు ౦ ౧

**పార్నంది [illegible]మశాస్త్రిగారివి**

- శ్రీమహాభారత విమర్శ ౦ ౮

**రాయసం శేషగిరి రావుగారివి**

- గౌతమమాజా (నాటకం) ౦ ౧౨

**రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారివి**

- నాటకోపన్యాసములు ౦ ౧౨

**సాహితీ సమితివారివి**

- సఖ. మొదటిసంపుటం. నాలుగు సంచికలు. కాలికోబయిండు. ౩ ౧౨

**కొ. శఠకోపాచార్యులుగారివి**

- జగత్కథ (వెల్సు వరల్డు హిస్టరీ) ౩ ౦
- కాకాజీవితము ౦ ౧౦

**మొసలికంటి సంజీవరావుగారివి**

- బక్సారు యుద్ధము చరిత్ర ౦ ౧౨
- ఝాంగంకేబుసాహెబు ౦ ౧౨
- సింధుబాదుకథలు ౦ ౫

**ముద్దుమాణిక్యం నరసింహారావుగారివి**

- కాంతం కథలు ౧ ౦
- నేను మా కాంతం ౧ ౪
- వక్రరేఖ ౧ ౦
- ఉపాధ్యాయుడు ౦ ౮

**రెం. లక్ష్మీనరసింహంగారివి**

- హృదయవిహంగము ౦ ౪

**నడింపల్లి జగన్నాథరావుగారివి**

- ఆంధ్రమహాభారత మాహాత్మ్యము (సాదా) ౧ ౪
- కాలికో ఉత్తమప్రతి ౨ ౮
- Age of Mahabharata 1 0

**చెలికాని సత్యనారాయణగారివి**

- జడగంటలు ౦ ౮
- రహస్యలేఖ ౦ ౮
- చక్రపాణి ౦ ౮

**గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారివి**

- వోటు ౦ ౧౦
- మూర్ఖరాజు ౦ ౪
- నీతిధర్మము ౦ ౪
- సంపూర్ణస్వరాజ్యము ౦ ౪
- శ్రీరామచరిత్ర [illegible] ౮
- ప్రపంచచరిత్ర (గ్రీసు) ౧ నుండి ౩ భాగాలు భాగం ౧౩ ౦ ౮
- నాలుగవ భాగము తయారులేదు
- Neglected Emperorpoet 0 8
- Spiritual Swadesi 1 0
- Age of Vemana 0 6

**మార్కండేయభవనం వారివి**

- సచ్చిదానందం (యునివర్సిటీ పోటీకి వెళ్లిన నవల) ౧ ౦
- కథాకావ్యము (పద్యాలు) ౦ ౧౨
- కథాకావ్యము (వచనం) ౦ ౧౨

**వెంపటి సత్యనారాయణగారివి**

- అక్బరు సార్వభౌముడు ౦ ౮

వలయ[illegible]వారు. కళాభివర్ధనీ పరిషత్తు. కలబరగి వారి యింటో. [illegible] —



సంపుటము ౬ రాజమహేంద్రవరము ౧౦ నవంబరు ౧౯౩౯ ౧౧ వ సంచిక

# మళ్లీ అయిదు కొట్టేదాకా............?

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

"ఇదిగో.....................ఇదిగో"

"....................."

"ఏమండోయ్ !"

"....................."

"......ఇలా చూడండీ"

"....................."

"......మెళుకువ రాలేదూ ! "

"....................."

"......మిమ్మల్నే నండీ"

"ఊ........."

"లేవరూ ?"

"....................."

"......ఇంకో మాటు చూడండీ"

"....................."

"మీాగుట్టు మీాపెదిమలు బైటపెడుతున్నాయి లెండి......వోస్"

"....................."

"ఏంసర్దుకుంటా రండీ లోపల్లోపలా ?"

"....................."

"....పులిక్కిపడ్డారా పాపం ?"

"ఏమిటీ అంటున్నావూ ?"

"తెల్లవారింది"

"వెలుగు—"

"పొద్దె పొడిచిం దండీ"

"అబ్బా! ఎంత బండనిద్దర పడుతోందీ యీామధ్య!"

"రాత్రిళ్లు చాలా శ్రమపడుతున్నారు కాదూ మరీ?"

"పొప్పొకున్నావా ?"

"......మీారంత కష్టపడి నాటకం రాస్తూవుంటే—"

"రాస్తూవుంటే ?"

"పదకొండుగంటలదాకా కవిత్వం చేస్తూ కూచుంటున్నారు కనక—రాత్రంతా సరిగా నిద్రలేక—తెల్లవారగట్ల చల్లగాలికి గాఢనిద్ర పట్టిపోతోంది"

"అయితే ?"

"అంచేత మెళుకువ రావడం లేదు"

"రాకపోతే ?"

"పెందలాడే లేవలేకపోతున్నారు"

"లేవలేకపోతే ?"

"సడే. నేను లేపాను"

"నువ్వెంతసే పయిందీ లేచీ ?"

"....................."

"అప్పుడే నీళ్లు పోసుకోడమూ, ముస్తీబు కావడమూ—"

"ఇప్పుడే అయింది. పొద్దెక్కిపోవడంవల్ల మిమ్మల్ని లేపుదామని—"

"నువ్వు లేచినప్పుడే యెందుకు లేపావు కాదూ?"

"తెల్లవారుజామున నేనా కాస్త సుఖంగాని నిద్ర పోకపోతే మీకు జబ్బుచెయ్యదూ?"

"నీకో?"

"నాకేం? మీరు ఆఫీసుకి వెళ్ళాక పన్నెండు గంటలదాకా నేను పడుకుంటూనే వున్నాను కాదూ?"

"అలా చెప్పాసుమరీ!......అయినా నువ్వు చీకటివుండగానే లేవడమూ, నేను పొద్దుపొడిచేదాకా పడుకోవడమూ—ఈ యెగుడుదిగుడు లేమీ బాగా లేవురుకూ"

"ఇంచక్క వున్నాయి"

"అయితే నాకేం?"

"నాకు మాత్రం యేం?"

"....................."

"....................."

"మరి లేవనియ్యి"

"....................."

"మంచం దిగిపూర్లుకున్నావేం?"

"ఏం?"

"లేవతియ్యి"

"బాగానే వుంది......"

"చేతు లందిస్తే యేమవుతుంది?"

"అ—వ్—వ"

"ఏంతప్పుమాట అన్నానూ?"

"ఎవరేనా వింటే?"

"పోనీ మాట్టాడను లే......"

"నాచేతకాదు బాబూ"

"అనలే చెడింది"

"ఏంగునుస్తారండీ?"

"....................."

"మళ్ళీ పడుకుంటే—పోనీ నాకేం? మొగం కడుక్కోడానికి పెట్టిన నీళ్ళు చల్లారిపోతాయి. నీళ్లుపొయ్యి ఆరిపోతుంది"

"తొరకంచు లెగవవతోస్తే సరి"

"డికాషన్ చల్లారిపోతే?"

"ఇంకా......మెల్లిగా......"

"కాఫీ సంగతి చెవినిపడితేనే మీకింత చురుకు వచ్చింది, అది కంఠంలో పడితే—"

"పంజాబ్ మెయిల్"

"బాబోయ్!"

"తొరగా పద"

"చన్నీళ్లు తోడనా"

"వేన్నీళ్ళు కాచా నన్నూ?"

"తొరపడాలి కండీ"

"అంతేకదా?......ఇంత ప్రేమతోటే లేపి, చివరికి చన్నీళ్ళలో మునగమంటావేమో బాబూ—"

"పా—పం"

౨

"పంచదార చాలదు"

"....................ఏం?"

"......ఎక్కువయింది. కసింత డికాషన్ పొయ్యి"

"..........చూసుకోండి"

"....................."

"చాలా?"

"మొకటికే వచ్చింది. ఇంకేం చూడనూ?"

"ఈమాటు పాలు చాలాయి కాదు...కదూ?"

"హా—హ్హా—హ్హా"

"బాగుంది యుక్తి"

"కనిపెట్టేశావ్!......ఏదీ? అరకప్పైనా వుందా నీకూ?"

"నాకిదే యెక్కువ"

"ఛా........."

"చాల్చాల్చాలు......అంతా నాకే యిచ్చేస్తావేమిటండీ?"

"ఈమాటు పుచ్చుకుందాం...మరి కానియ్యవేం?"

"పుచ్చుకోడానికి అసలు మీకు గుక్కెడేనా లేందే"

"ఇందాకా నీకో?"

"....................."

"....................."

"కోపం వచ్చిందా?"

"రాదా యేమిటి నువ్వు చేసిన పనికి?"

".........ఏం?"

"గడ్డం పట్టుకున్నప్పుడు......ఇక యిద్దరికీ సమానంగా పంచు మరి"

".........ఏం?"

"నాకెక్కువ యిచ్చావు"

".........సరిగా లేదూ?"

"ఇంకాస్త తీసుకో"

"చూడండి"

"....................."

"ఇంకాస్త"

"....................."

"ఇంకో రెండుచుక్కలు"

"....................."

"వొక్కచుక్క"

"గ్లాసు పట్టుకురానా?"

"అరచుక్కా......ఆ! సరిపోయింది. ఇక పుచ్చుకో......"

"మీతో సరిగా వాటా పెట్టాలా నాకూ?"

"కష్టపడి తయారుచేసినందుకు నీకే యెక్కువ వుండాలి న్యాయానికి"

"మరి వొక్క చుక్కా — అరచుక్కా — అంటూ తూచినట్టు పంచారేం?"

"వోడిపోయాను......"

"దురుసుతనం యెప్పుడూ పనికిరాదనుమండీ"

"....................."

"తప్పుమాట అన్నానా?"

"....................."

"...కోపం వచ్చిందా?"

"....................."

"ఏంచేస్తే పోతుందో చెప్పండి మీ కోపం?"

"నావాటా నీవాటా కలిపి—"

"నోటికి పోతుందా?"

"పానకాలరాయుడు లాగ—"

"మహాబాగా జ్ఞాపకం చేశారండి. మంగళగిరి వెడదామా వోమాటు?"

"ముందీ సంగతి తేల్చు"

"అయితే వొకటి చెప్తా వినండి"

"ఏమిటది?"

"ఎల్లుండి మీరు విశాఖపట్నం వెడతారు కాదూ!"

"వెడితే?"

"అప్పుడు నావాటా, మీవాటా కూడా నేనే పుచ్చుకుంటాను లెండి"

"అక్కడ నేనే మరో కప్పు యెక్కువ పుచ్చుకుంటానేమో?"

"నేను చూడవచ్చానా యేమిటి?"

"నేనుమాత్రం చూడవచ్చానా యేమిటి?"

"....................."

"మాట్లాడవేం?"

"......కాఫీ చల్లారిపోతోంది చూశారా?"

"అదిగదీ! చివరికి అలా తీసుకురావాలి పాయింటు దగ్గిరికి......మరి కానియ్యి......"

"....................."

"....................."

"ఏమండీ! మంగళగిరి మాట చెప్పరూ?"

"......వెళ్లాలని వుందా?"

"ఎన్నాళ్లనుంచో వుందండీ. ఒక్కమాటు వెడదాం. మళ్లీ నాలుగురోజుల్లోనే తిరిగివద్దాం. ఏం? పాతిక రూపాయలే కాదూ జీతం నష్టం?"

"......పైగా ఖర్చులో?"

"మూడోక్లాసులో వెడదాం......"

"....................."

"ఏం, నవ్వుతారేం?"

"కవులు తమ పద్యాలు తామే చదవడం కూడా తప్పా కాదుగదా కొంపతీసి ?"

"నీలాంటివాళ్ల దగ్గిర చదవడానికి కూడా యోగ్యత వుండాలి"

"బా—గా చెప్పారు, కనక మీరే చదవండి"

"అయితే విను—"

జాల మొకింతయున్ సయిపజాలని..................

... ... ... ... ... ...ఒక క్రొక్కళ్లపై ప్రాలి, కవుంగిటన్ బెనగు పట్టుల నిగ్గులు దేరు ప్రేమ... ..........అతృప్తమనమ్ముల ముగ్ధ దిద్ది తీర్చుతన్.

"......మధ్యమధ్య కాళీ లట్టేపెట్టారేం ?"

"చేతకాక"

"వులకం !"

"వేళాకోళం కాదు. అయినా నువ్వు పూర్తిచెయ్యి చూస్తాను"

"...................."

"కానియ్యి మరీ......పొరపాటున నే నెత్తుకున్నాను గాని, అన, లిది, కవయిత్రీమణుల్లు లెత్తుకోవలసిన ఘట్టం. అయితే, నువ్వు పూర్తిచేస్తే మాత్రం యిక నా తప్పుండదు"

"అ—లా—గేం! పా—పం!......అయితే—మరి—యెక్కిరిపించవుకదా ?"

"అబ్బే"

"తప్పొస్తే దిద్దుతారా మరీ ?"

"నాతర మయితేనూ"

"చూశారా !"

"దిద్దుతాలే, దిద్దుతాలే"

"......సవ్యాకం డేం ?"

"...................."

"......ఓరచూపులు చూస్తున్నారు"

"ఎంత సేపూ గునవడం!"

"అన్నీ కుదరాలా మరీ !......

జాల మొకింతయున్ సయిపజాలని రాధయు—

"రాధా !"

"మరేవరూ ?"

"...................

జాల మొకింతయున్ సయిపజాలని రుక్మిణియున్—

"నేను చెప్పలేదూ ? మీరు రెప్పుడూ నా మీదే పట్టిస్తారు......"

"ఇదిగో"

"...................."

"ఇలా రావూ ?"

"ఏమో బాబూ !"

౫

"ఏమంటావ్ ?"

"మీరే మంటారూ ?"

"నిన్ను వెళ్ళ మంటాను"

"...................."

"దసరాకీ వెళ్ళక, దీపావళికీ వెళ్ళక, చివరికి సంకురాత్రికేనా వెళ్ళకపోతే ఘోరకలి అనిపించుకోదూ ?"

"...................."

"పైగా, మీ చెల్లెలూ మరిదీ కూడా నాలుగురోజుల కిందటే వచ్చారుట"

"...................."

"నిరుడు మనం బొంబాయిలో వుండిపోయాం కనక సవం లేకపోయింది. ఈయేడు ఇంట్లోనే వుండికూడా—"

"మీకు సెలవు లేనప్పుడేం చేస్తాము ?"

"నువ్వు వెళ్ళడాని కేం ? నేను శరీరం అమ్ముకున్నాను. నీకేం అడ్డూ ?"

"నేను మనస్సూ, హృదయమూ కూడా ధారపోసుకున్నాను......"

"......ధన్యోస్మి......రుక్కూ ! మాటిమాటికీ నీయెదటే నిన్ను స్తుతిచెయ్యడం పెద్దమనిషితరహా కాదు. మూడువందల రూపాయల జీతమూ, శౌర్యత గల పదవీ నీకాలిగోటికి పోలవు. అవేనా, నువ్వు నాపాలిటి భాగ్యదేవతవు కనకనే వచ్చాయి. నిజంగా నాఅంత సిరిగల భాగ్యశాలి మరొకడు లేడు ; కాని మీ అమ్మగారు మీ నాన్నగారూ పెద్దవారైనారు. వారి ముచ్చట లోటు చెయ్యడం—"

"మీరు రాకుండా—మిమ్మల్ని విడిచి నేను వెళ్లలేనండీ."

"ఇలా చూడూ......ఇదిగో......ఒక్క క్షణం నా మొండి విడిచిపెట్టి నా కేసి చూడవూ?"

"...................."

"ఒక్కమాట విను. అంతే"

"...................."

"పోనీ, అవిరళికాకపోలంగా నేనా వొక్కమాటు మొగం యిలా తిప్పావో"

"...................."

"......వెళ్ళవూ!"

"...................."

"నలుగురూ నాలుగు విధాలా నన్నంటారు"

"ఎవళ్ళ మంచిచెడ్డ లెవళ్ళకి తెలుస్తాయీ?"

"......ఇంకేం చెప్పనూ!"

"కథ చెప్పండి"

"శాస్త్రం చెప్పినట్టుంది......చివరికి మీ అమ్మగారికి నీమీదకూడా కోపం వస్తుంది"

"......చిన్న ఉత్తరం చూడండి"

"నీకు కూడా రాశారూ మీ నాన్నగారూ? ఇంకేం?......ఇది మీ అమ్మగారి దస్తూరీ"

"చదవండి"

"నాకన్న తల్లిని దీవించి—"

"ఇంకా ముందు"

"మీ రిద్దరూ రావడమే—"

"ఇంకా ముందు"

"పోనీ, అతగాడికి సెలవు పుట్టదంటే నిజమే. అయితే, నువ్వేనా తప్పకుండా రావాలి. తప్పదు. నువ్విది వరకే రానందుకే చెల్లాయి నన్ను నిలవనివ్వడం లేదు. నీజవాబు చూసుకుని, నువ్వు రమ్మన్ననాటికి మీనాన్న గారు వస్తారు......చూశావా? మీ అమ్మగారు సింది చాలా న్యాయంగా వుంది......పోనీ, వీలుం స్తే రానివ్వాన్నా?"

"ఇదో ఉత్తరం కూడా చూడండి"

"......ఇది మీ చెల్లాయి రాసింది. ఇవ్వాడేనా తే—"

"చదవండి"

"అక్కయ్యకీ, అక్కయ్యద్వారంగా బావగారికీ నమస్కారాలు—"

"ఇంకా ముందు"

"నేను మొన్న ఆదివారమే నవరివారంగా—సెబాస్! మహామంచిమాట వేసింది మరద లిక్కడ"

"పదిబంతుల తరవాత చదవండి"

"బావగారికి సెలవు లేకపోతే నీకూ సెలవు లేదా యేమిటమ్మా?—చూశావా? చివరికి ముక్తాయింపు నామీద—"

"మరో నాలుగుబంతులు దాటించి చదవండి"

"రేపు సాయంత్రం—ఆరుగంటలకి—రైలుకారులో వస్తావా, సంతోషమే. లేకపోతే, నీకోసం—అంటే నిన్నిక్కడికి తీసుకురావడానికి ఎల్లుండి పొద్దుటి పాసెంజరులో నేను వస్తున్నాను. అప్పటికేనా నువ్వు ప్రయాణం తెములుచ్చుకుని, నాకోస మేనా స్టేషనుకి వస్తే, అక్కణ్ణుంచే వెనక్కి మళ్లి, మెయిలెక్కి మనం కాకినాడ రావచ్చు......చూశావా?...ఇక మోటతనం అనిపించుకుంటుంది. నామాట విను"

"...................."

"పోనీ, వచ్చి మీఅక్కయ్యని తీసుకువెళ్లవలసిందని మీచెల్లాయికి రాయనా?"

"ఓపనిచేస్తారా?"

"ఏమి టదీ?"

"కోప్పడరుగదా?"

"ఎప్పుడేనా వుందా?"

"...................."

"...................."

"చెప్పెయ్యనా?"

"ఆలస్యం యెందుకూ?"

"మా చెల్లాయినీ మా మరిదినీ—"

"ఇక్కడికి తీసుకు వద్దామా? చాలా బాగుంది"

"...................."

"సెబాస్!......అయితే వెళ్లి పిలిస్తే గాని బాగుండదు......పగలు వీల్లేదు కనక రాత్రిబండిలో వెళ్లి పిలుచుకు రానా?"

"రాత్రి నే నొక్కత్తినీ వుండనా యిక్కడా ?"

"తెల్లవారే టప్పటికి వచ్చెయ్యనూ ?"

"నా కేమీ తోచదండీ......ఒక్కకను కేనా రాదు. తెల్లవారే దాకా మంచం నడు మెక్కి కూచో వాలి"

"పోనీ, మనం యిద్దరమూ వెడదామా ?"

"ఏం బాగుందో బాగుంది. ఈమాత్రం భాగ్యానికి—"

"మీ చెల్లాయి కోసం కాదిదంతానూ. మీ మరిది—"

"అతగా డేం ఆకాశంనుంచి వూడిపడ్డాడా యేమిటి ? నే నుత్తరం రాస్తానే జవాననివ్వండి"

"నాకు ధైర్యం చాలడం లేదు"

"అదంతా నేను చేస్తాను కాదూ ?...మా చెల్లాయి మాటకి అడ్డు చెప్పగల డేం అతనూ ?"

"అసలు మీ చెల్లాయి మాట ?"

"అది వొట్టి వెర్రిపిల్ల. నావుత్తరం చూసిం దంటే యెగిరిగంతు వేసుకుంటూ వస్తుం దది"

"అయితే ఒక్కే"

"ఏం ?"

"ఇదేమి టండోయ్, మీ మరదలు—అంటూ నలుగురూ నన్ను చూసి నవ్వుతా రేమో గదా ?"

"......మీ కొంటెమాటలు..... ఏం ?"

"హాయ్, హాయ్ !"

"....................."

"బుగ్గపోటుకంటె యిదే బాగుంది. పార్వతీ పరమేశ్వరుల కేనా యింత యేకీభావం వుండదు"

"నాకు కోపం వచ్చిందంటే బాగా జరగదు, ఏమనుకున్నారో !"

"ఏదీ, ఆమాట నా కేసి చూస్తూ అనూ"

"............ఏమండీ, మాచెల్లాయిని తీసుకురావద్దూ ?"

"నేను వద్దనగలనా !, కాని వారి నిద్దర్నీ తీసుకు వచ్చి మీఅమ్మగారినీ, మీనాన్నగారినీ—"

"వచ్చివులునూ అన్నమూ తినమని పండుగల్లో వారి నిద్దర్నీ అక్కడ అట్టేపెడతామా యేమిటి ?"

"అలా అన్నావు బాగుంది. ఈమాటు నాకు నచ్చింది"

"ఉత్తరం రాసి తీసుకురానా ?"

"తీసుకురా"

"ఎందు కేనా మంచిది, మానాన్నగారికీ, మామరిదికీ కూడా మీరు రాయండి"

"అలాగే"

"మాఅమ్మగారికి మాత్రం నేనే రాస్తాలెండి"

"సరే"

"........ పోనీ, యీపాటికి వంట అయిపోతుం దేమో, కుక్కరు దింపి, అన్నీ సిద్ధం చేసి మిమ్మల్ని పిలవనా, ముందు వుత్తరాలు రాసుకురానా?"

"పది నిమిషాల్లో రాయలేవూ?"

"అంత సే పెందుకండీ నాలుగేసి మాటలు రాయడానికీ ?"

"పుట్టింటికి వుత్తరం రాయడం అంటే కలమూ కాగితాలూ పుచ్చుకూచోడం తొరగా తెముల్తుంది కాని ముగించడం మాటలతో యెప్పుడూ కాదుగా?"

"అలాగే ? .........ఎప్పుడో, పొద్దున్న అనగ పుచ్చుకున్న కాఫీ. మీరు రాయమన్నారు కనక వి లేక వొప్పుకున్నాను గాని, లేకపోతే, కసింత ధాకక పడితే గాని నావల్లకాదు బాబూ వుత్తరాల్లు రాయడం. కాకపోయినా, మా వాళ్ల కసలు వుత్తరమే అక్కర్లేదూ. కాకిచేతి కబురు పంపితే వచ్చేస్తారు"

"అయితే యిక వుత్తరం యెందుకూ కాగితాదండుక్కీ ?"

"మామరిదికి రాయా లన్నారు కాదూ మీ"

"అతనికి నేను రాస్తాను కాదూ!"

"మీతమ్ముడికి మీరు రాశాటప్పుడు మ యిక నేను రాయకూడదు టండీ!"

"....................."

"కాకపోయినా, మీరు రాత పూర్తిచేసి భోజనానికి వచ్చేదాకా నేను గోళ్లు గిల్లుకుంటూ కూచోడమే కాదుటండీ!"

"......................"

"పోనీ, మా అమ్మగారికీ, మా చెల్లాయికీ కలిపి వొక్క వుత్తరమే రాస్తాను లెండి మీ కంత కష్టంగా వుంటేను"

"......................"

"మా నాన్నగారికి మాత్రం, మీరు రాసిన వుత్తరంలోనే నాలుగుబంతులు, కింద, రాస్తాను......సరా!"

"ఇక నువ్వు రాయం దల్లా మీ మరిది వొక్కడికేనీ"

"మీరు రాయవలసిం దంతా రాశాక, "మీ వదినగారు యిక్కడికి రావలసిం దని నీకు రాయమని మరీ మరీ చెప్పిం దని మీరే రానేయండి వొక్కమాట"

"మొత్తానికి నాటకంలో వొక్క అంకం అంత గ్రంథం నడిపావు"

"కష్టపడకుండా మీ నాటకంలో కొక అంకం దొరకడం మీకే నయం కాదూ!"

"అయితే, తక్కింది కూడా పూర్తిచేసిపెడతావా నువ్వు?"

"మామ్మో! కష్టపడి నేను రాస్తే, మీరు రాసినట్టు ప్రకటించుకుంటారు కామోసు పా——పం"

"పురుషుల అవ్యాజకరుణాకటాక్షంవల్ల, తెనుగుదేశంలో, యివ్వాళు, అక్షరజ్ఞాన మేనా లేని స్త్రీ లెంతమంది కవయిత్రీమతుల్లు 'లయిపోతున్నారో మరిచిపోయావా?"

"ఆసంగతి తెలిస్తే, ఆస్త్రీలు, ఆపురుషుల కెలాంటి సత్కారం చేస్తారో యేమేనా వూహించారా మీరెవ్వరేనా?"

"......గట్టిచిక్కే తెచ్చిపెట్టావు"

"దీంతో అయిపోయిం దనుకున్నారా యేమిటి? ఆంధ్రమహిళాసభలో యీ విషయం వొక తీర్మానం కూడా నెగ్గిస్తాను చూస్తూవుండండి"

"వద్దువద్దు. ఇంతటితో చాలించు నీకు పుణ్యం వుం... ఆ ఆడంగిరేకలవారిని అలాగేనా బతకనియ్యి.

"వెళ్లి వుత్తరాలు రానుకురా"

"నిమిషంలో వచ్చేస్తా నండీ; ఏం?"

"...రగా వెళ్లు"

"......మీకు భోజనానికి ఆలస్యం అయిపోయింది పాపం! పోనీ, భోజనా లయినాక రాసి ఆఫీసుకి పంపిస్తానండీ"

"ఏమీ ఆలస్యం కాలేదు. ముందు వుత్తరాలే రానుకురా"

"మాటల్లో పడి ఎంతపని చేశానూ!......"

౬

"......ఇవాళ చేమకూర మంచి పాకాన పడింది సుమా!"

"మీరు నాహృదయం అంతా వుత్సాహంతో నింపేశారు కాదూ!"

"అయితే!"

"అంచేత పొంగవు సరిగా పడింది"

"అదా కథా! అలా అయితే, నువ్వు చేసిన ఆదరం నన్నానందసాగరతరంగాలమీద వూపెయ్యలేదూ!"

"......ఎటొచ్చినా విసురు నామీదే"

"తప్పుతుందా మరి! నాలుగుగోడల మధ్యా వున్నంతసేపూ స్త్రీకి వుండే బాధ్యత పురుషుడి కేం వుంటుంది!"

"......అయితే, మొగాడు కొంత నక్క అయితే ఆడ దేం చెయ్యగల దండీ?"

"తల్లి, బాధ్యత తెలిసిం దయితే వా డలా కొంక నక్క కాదుగా!......"

"......................"

"దీనివల్ల మొగాడు ఏంచేసినా చెల్లిపోతుం దనీ, ఆడదానికి, సంసారంలో, కష్టం తప్ప మరేమీ లేదనీ అనుకోకు. మొగాడు సంసారంలో కేవలమూ వుపకరణం... వివరంగా చెబుతాను విను. మొగాడు పదునైన బాకు అనుకో. వీరుడి తెలివితేటలను పట్టే కాదూ ఆబాకుకి వినియోగం!"

"అయితే, మన పెద్ద లంతా ఆబాకుని చంటిపిల్లల చేతి కిస్తున్నా రన్నమాట కాదు టండీ?"

"ఇంకా సందేహమేం!......చదువు చెప్పించక—చిత్తానికి పరిణతి కలిగించక—హృదయానికి వుత్తేజనం యివ్వక—చిన్నతనంలోనే ఆడదానికి పెళ్ళిచెయ్యడం అంటే అంతే కాదూ అర్థం!"

"......మానాన్నగారు మంచివారు. కారుటండీ!"

"కనక నే నదృష్టవంతుణ్ణి—"

"రెండు ముక్కలు వెయ్యనా!"

"ఇంకెందుకూ, వారుకూడా అయిపోయాకా?"

"...... ..... ....."

"... ......... ...."

"ఎంత కమ్మగా వుండో మీగడ!......"

"ఎంత తియ్యగా వున్నాయో పాలు!......"

"గొర్రెగాకు మహా మంచివాడు సుమండీ పావం"

"వాడు గుల్లో .... కవీ, యింకి పెట్టకపోతే మాత్రం తెలుస్తుందా .... మో ....మో"

"... ... ... తీసకొని విందుకు రమ్మన ... ... ......"

"......... చేశావ్! అయితే ... పండుగలో మన యింటో వుండేవా ఖ్యంతా జోడాలే అన్న మాట.. ..."

"......అలా అయితే వోచిక్క వచ్చిందే!"

"ఏమి టది?"

".. .. ... ... విఠంతావు కదా?"

"ఓహోహో! చిక్కే!.. ...అయితే పండుగ నాలుగురోజలూ ... కోడల్ని రమ్మను పనికి. పెద్ద వండగునాడు, దాన్ని, మొగుణ్ణి తెచ్చుకోమను విందుకి"

"మునలిముండ ... దూ?"

"ఏడ్చినా సరే, ......మరేం చేస్తామూ? మన యింటో కజ్జోను వ్యవహారాలు పనికిరావు కాకపోతే, దానికి పెట్టవలసిం దేదో కోడలి కిచ్చి యింటికి పంపే సెయ్యి"

"అంతే కదా పాపం? మహా మంచి ముండ సుమండీ అదీ?"

"అంచేత నేనా యేమిటి ముండ అంటున్నావు?"

"......................."

"నవ్వుకుని వూరుకుంటావేం?"

"మీామీద సొద్దూ"

"నిన్న రాత్రి ముందు నువ్వే లేచావుగాదూ?"

"అ—వ్—వ"

"ఏం?"

"చాల్లెండి సెప్పుకున్నారు. ప్రతీపూటా యిద్దరమూ ఏకబంతని అంటున్నా మని అందరక తెలవాలి కాబోలు"

"ఇదివరకే తెలుసు నందరికీనీ. మనల్ని చూసే హెడ్‌మాస్టరుగారు కూడా యేకబంతి మొదలు పెటాతు"

"కూచోండి అలాగ మీాయిష్టం వచ్చినంత సేపు"

"......................."

2

"ఈరెండాకులే. ఇవి వేసుకోకపోతే నన్ను చంపుకున్నా—"

"గుప్పా! నువ్వు నన్నెలా విడిచిపెట్టలేకుండా వున్నావో, నిన్నూ నేనలాగే విడిచిపెట్టలేకుండా వున్నాను; కాని అప్పుడే పదకొండూ అయి దయింది. ఇక్కడికే అయితే—"

"అసలు కంపెనీకి మీారే పెద్ద కదా, మిమ్మల్ని అడిగేవా రెవరండీ?"

"నేనే తప్పు చేసి యిక గుమాస్తాల నేం ముదలకిందనూ?"

"......................."

"మళ్లీ చిలక చుడుతున్నావు. చూశావా?"

"ఇక మిమ్మల్ని బలవంతపెడితే అడగండి, ఈచిలకలో నగం......"

" ........ఇక తే"

"..........ప్పు..."

" ........పాగా"

" ........జుట్టు కొంచెం చెదిరిం దండీ"

"పాగా పెట్టుకుంటే.........ఏం!"

"......................."

"........ ............"

"......................."

"లోపలికి వెళ్ళు"

"మీారు సైకిలుదగ్గిరికి వెళ్లండి"

".............ఇక వెళ్ళు"

"సైకిలు స్టార్టు చెయ్యండి"

"..... ........ఊ"

"ఎక్కండి"

".............వెళ్ళు మరి"

"ఒక్క నిమిషం......అరనిమిషం ..........

......ఉండరూ?. ఉండరూ?.........దిక్కుమా... బస్సు, ఇదెక్కడ వచ్చిం దమ్మా మమ్మల్ని ... దానికీ?........."

యాను తల్లి దేవత అందుచేతఁ జంద్రజ్యోతి వానిని ప్రేమించినది. అంతియకాని వారి యొుల సౌందర్య మన్నది లేదు

ఒకనాఁడు డయాన్థసు తన చెలికానితో మాటాఁడుచుండెను. అతని ముందు డయాన్థసు తన సౌందర్య శత్రువులను నిందించుచుండెను. "నీవు నార్సిససును గాని, యెండిమియానును (Endymion) గాని యెన్నఁడు చూడలేదు కదా! వారందఱు గాంద్రుకారని నీకెట్లు తెలియును?" అని మిత్రు డడిగెను. డయాన్థసున కీప్రశ్నతో గోపము వచ్చెను. ఆనాటితో వారి చెలిమి యంతమైనది

౨

డయాన్థసు కడుపు మండిపోఁదొడఁగినది తాను ప్రేమించిన యేదేవతా స్త్రీయుఁ దన్నుఁ దిరిగి ప్రేమించలేదు లోకమునందలి స్త్రీ లందఱు వానిది దేవతా సౌందర్య మని మెచ్చుకొందురు కాని ప్రేమించరు అతని చెవులయందు నిత్యముగా నతని శత్రువుల గుణస్తుతులే పడుచుండెను అతఁ డీహృదయములోని బాధకుఁ దాళుకొనలేక పోయెను అతని పంచేంద్రియములు నతని మనస్సును పట్టుడికిన ట్లడికిపోయెను.

డయాన్థసు జనపదములయం దోర్చుకొనలేక పోయెను ఇది కలుకుఁ దానందగాఁ డనుకొనిన లోకము తన్నుఁ జూచి వెక్కిరించుచున్న దని యతఁ డూహించెను వారి నతఁడు సర్వదా నిందించెను ఆ దలతోఁ బగపెట్టుకొనెను దీనిమూలమున నతనికి జనపదవాసము మిక్కిలి కష్ట మయ్యెను. అతని వేడిపించుటకుఁ జాల మంది మనసులో నతఁ డందగాఁ డని యనుకొనుచుఁ గూడ ఛీ, ఛీ యతి డేమి యందగాఁ డన నారంభించిరి. తన గుణముచతఁ దెచ్చుకొన్న యీవిరోధము నతఁడు తన గుణమునకుఁ గాక లోకము యొక్క బుద్ధిమాంద్యమున కంటగట్టెను ఇట్లు లోకమునకు నతనికిఁ జెడిపోయినది.

ఒకనాఁటి ప్రొద్దున నతఁడు తా నడవులకుఁ బోయినచో నీ బాధ తగ్గు నని తలచెను. పోవుచుండగా నాతని యెదుట నొక స్త్రీ నిలఁబడెను

ఆమె యీర్ష్యాధిదేవత ఆమెకన్నులరంగు ఆకుపచ్చన. (Green eyed jealousy) ఆమె యతని నడవులలోనికిఁ బోవ ద్దన్నది తానతనిని గక్షిఁ చెద నన్నది. ఆమె నతఁడు వెంటఁబెట్టుకొని తన యింటికిఁ బోయెను.

డయాన్థసునకు నామెమీదఁ బ్రేమ లేదు కాని తన్నెవ్వరుఁ బ్రేమించలేరు ఎవ్వతయో యొక్కతె తన్నుఁ బ్రేమించినందు కతఁడు సతోషించెను. తాను ప్రేమించవలయు ననుకొన్న కీర్తి మెుదలైన దేవతలు తన్నుఁ బ్రేమించకపోయి రన్న విచారము వాని హృదయములో నణగ్గొనిపోయెను అది యతని మెుగములో నొత్తుకొని వచ్చెను. ఈ నిగూఢదుఃఖ మీర్ష్యాదేవి పొందిన యలుపవ్రుసుఖము వాని మెుగమునఁ గలసి, వాని మెుగ మొక వికారము పొందెను. భిన్నగుణములు కల వస్తువుల కలయిక వికృతిహేతువు కదా!

ఈర్ష్య యను గ్రీకుల దేవత యున్న దని నామెను గౌరవించలేదు డయాన్థసు లోకమును జ్ఞానహీన మని నిందించి యా యీర్ష్యాదేవత, యందఱు దేవతలకన్న గొప్పది యని వాదించెను ఆమె యాకుపచ్చని కన్నులు చూచి లోకము భయపడెను. ఆమెను జూచి పసిరిక పామును జూచి లోకము కలఁతపొందెను. కాని డయాన్థసుమెను కౌగిలించుకొని యామె కన్నులలోనుండి యామె హృదయముదాకఁ జూచెను

క్రమక్రమముగా నామె సంయోగమువలన డయాన్థసులో మార్పు కలిగెను ఈర్ష్యాధిదేవత మెుగ మతని మెుగముతోఁ గలసినప్పు డెల్ల నతని ముఖావయవములు మార్పుఁజెందెను అతని ముక్కు న కూదారంగు వచ్చెను. ఆ ముక్కు చివర తేలి, యది యెఱ్ఱవాగు పసుపుగా మారెను చివర వచ్చని సన్నని దిమ్మవలె నయ్యెను

అతని చెవులు తీగవలె నల్లుకొన్నది, చివళ్లు పెరిగి పిట్టిబ్బలి వలె నయ్యెను

అతఁడు లోకమునంకఁ జూచుట మానివేసి నిత్యము నూర్యమండలము వంకనే చూడ నారంభించెను అతని కన్నులలోఁ దెల్లగ్రుడ్లు నారింజరంగుగాఁ దిరిగెను. నల్లగ్రుడ్లు ఎఱుపురంగు కలిసిన పసుపురంగు తిరిగెను ఆ కన్ను లంతకంతకుఁ బెద్దవై ప్రొద్దుపొడుపుపూలవలెఁ గనిపించెను

అతని పెదవి లేతయెఱుపు మానలేదు. కాని దానిమీద తెల్లని బొట్లవలెఁ జిన్నచిన్న మచ్చలు కలిగెను.

అతని చుబుక మాకుపచ్చరంగుగా మారెను చివర మగ్గగానున్నభాగము గట్టిపడి దిమ్మకట్టెను

వాని మీసములు నారింజరంగు ప్రబలించుకొనెను. చిట్టచివళ్లు నల్లగానే యుండెను.

ఈ మార్పు లోకము గ్రహించెను. దినదిన మతఁడు మునుపటికన్న యందగాఁ డగుచుండె నని లోకము గ్రహించినది అతఁడు లోకాతీతాయి సౌందర్యవంతుఁ డని నిస్సంశయముగాఁ దేలినది. లోకమునందెల్ల జనులకు నతని వంకఁ జూచుట, యతనిని బొగడుట, జన్మచరితార్థము చేసికొనుట యనిపించినది. కాని యెవ్వరు నట్లు చేయలేదు

కాలము గడచినది. ఈర్ష్యాదేవత పరమరాక్షసి ఆమె యొుడలి నిండ నెత్తురులేదు విష మున్నది. కొంతకాల మామె సహ[illegible] ము చేసినచోఁ బురుషులు చనిపోదురు. ఆమె యొుడలిలోని విషము జాల యొడళ్లలోనికిఁ బ్రవహించి, వారు క్రమముగా నశించిపోదురు.

దయాన్థసు సౌందర్య మంతయు నసలే దేవతాసౌందర్యము. ఈదేవతాసంయోగముచేత నతని శరీరరేఖలే కాక యతని శరీరములోని రక్తబిందువులు కూడ నస్థిచయముకూడ, బ్రేవులుకూడ, మాంసముకూడ నొకానొక దివ్యత్వమును సంపాదించుకొన్నవి. ఆదివ్యత్వము పెరిగినకొలంది నతనిలోని మానవత్వము క్షీణింపజొచ్చెను.

ఆనాటి యతని మానస మొక విచిత్రస్థితి బొందినది. ఆమానసము నంటియున్న యైదింద్రియములు చిత్రముగా మారెను.

నేత్రములు పసుపుపచ్చదనము పొందినను నతని చూపు లాకుపచ్చరంగుగా నుండెను. ఈర్ష్యాదేవత తన ముద్ర ఘటిల్లెనని సంతసించెను.

నాసిక యూదారంగుగా నున్నను జిట్టచివర నాకుపచ్చ డిస్కు కట్టెను.

చెవులు నీటిప్రపక్షులవలె నీలపురంగుగా మారినను నొక విధమైన యాకుపచ్చని రంగు వానియంతట నావరించి యుండెను.

అతని నాలుక యాకుపచ్చని రంగు పొందెను. అతఁడు సామాన్యముగ నోరు తెఱువడు. ఈర్ష్యాదేవతారహస్యంగమవేళ నీర్ష్య యతని పెదవి ముద్దాడి నోటిలో నోరు వెట్టి తన దంతములచేత నతని జిహ్వాగ్రమును గొఱికి యతఁడు కొంచెము బాధపడగా నొచ్చుకొని యొకమారి నాలుక చాపించి చూచెను. అతని ప్రాణములోఁ దాను స్థిరపడినందుకు మిక్కిలి సంతోషించెను.

అతని శరీర మంతయు నాకుపచ్చని రంగు తిరిగెను.

౩

ఒకనాటి ప్రొద్దున దయాన్థసు ఈర్ష్యతోఁ బోట్లాడెను. "ఛీ ఛీ! నీమూలమున నేను చెడిపోతిని. మానవులకు దూర మైతిని. నేను మానవుఁడను. మానవలోకమునకు నే నెడమైపోతిని. నీ వేగడియ నాయొద్దకి వచ్చితివో యాగడియకన్న దౌర్భాగ్యపుగడియ లేదు. నీవు దేవతవు. నీకుఁ గనిపించుచున్న యీశరీరము నిజమైనది కాదు. నీ వీ శరీరమును లీలగా గ్రహించితివి. నీతో సంసర్గము చేసి నేను మానిసిగా నుండుట మానివేసి యొక దేవముగాఁ దయారైతిని. నన్ను నావారు మెచ్చుకొనుట లేదు." అనెను.

ఈర్ష్య యతని వంక నిదానించి చూచెను. తా నిన్నాళ్లతనితోఁ గాపురము చేసినను ప్రధానమైన యతని మనస్సు వికారము పొందలేదు. అతని యాత్మ మార్పు పొందలేదు. అది దుర్బలముగా తీవ్రములగు నింద్రియములు, మనస్సును దన సంపర్కముచేత మారినను మార్పు పొందని యాత్మలక్షణమైన యొక తెల్లన ప్రకాశించుచునే యుండెను.

ఈర్ష్య తన యధికారపు హద్దు తెలిసికొని లేచిపోయెను.

ఈర్ష్య లేచిపోయిన సంగతి దయాన్థసు లోకమునకు తెలియపరచెను. అతనికి లోకముమీద నొక విధమైన కోపము వచ్చెను. ఈర్ష్య తనయింట నున్నంతమాత్రమున దనతోఁ బుట్టిన మానవప్రముఖులు నింత తిరస్కరించవలయునా? యని వారివంకఁ జూడవలయునని లేదు. ఈర్ష్య తాత్కాలికముగ లేచిపోయిన దనియో, యతని యింటిలోననే యున్న దనియో లోకము తలంచి యతనివంకఁ జూడలేదు.

దయాన్థసునకు మనసు విరిగెను. అతని సౌందర్యము భూలోకమున కలంకారప్రాయ మైనది. తానింతటి సౌందర్యము కలవాఁడై లోకమునకు మే లేమి చేసెను? లోకము తన్ను తిరస్కరించినమాట నిజమే. తాను వారి కేల యుపయోగపడరాదు? తన పేరు మీద మహాసుందరమైన యొక శాఖను మానవజాతిలో సృష్టింపలేదు. తన సృష్టి యిట్లు వృథా యైపోయెను. ఈదిగులులో నతఁడు కొంత చివికి యొకనాఁటి సాయంకాలమున బ్రాణము చల్లనగుట కొక సరస్తీరమునఁ జేరెను. అందుఁ గూర్చున్నవాడు కూర్చున్నట్లు క్రుంగి పోయెను.

౪

చాలకాలము గడచెను. అతని శరీరమును మృగములు, పక్షులు, పురుగు లేమియును ముట్టలేదు. కర్పూరము వలె నది హరించి పోయెను. అతని శరీర మొకచోట, శిర స్సొకచోటఁ బడెను.

దయాన్థస్ :—అతని ముఖావయవములనుండియు, నతని శరీరమునుండియు నతని యింద్రియములనుండియుఁ జక్కని పూలమొక్కలు పుట్టెను. అతని పేరులో నెనిమిది యక్కరము లుండెను. ఒక్కొక్క యక్షరమున కొక్కొక్క మొక్కగా బయలుదేరి యతని సౌందర్యమును లోకముచేత నొప్పించెను. అతని శరీరము పడినచోట నతని పేరుతోడనే యొక పూమొక్క మొలిచెను. అతని శరీరమువలె నదికూడ నొక విశాలమైన గరికవలె నున్నది.

అతఁడు రంగుగల దుస్తులు ధరించినట్లు మొక్క రకరకాల రంగులఁ బూచును.

ఇపోమియా :—అతని చెవులు పడినచోట ఇపోమియా యను పూలమొక్క మొలచెను. దాని పూవులు నీలిగంటలవలె నుండెను. అవి నీటిప్రపక్షులపూల వంటివి.

ఎమోరిలిస్ :—అతని పంచేంద్రియములును నతని మనస్సును గలసి దాని యాకులుగా, నతని యాత్మ దుంపగా, నీ పేరుగల దుంపజాతి మొక్క పుట్టెను. దాని కాడలు తెల్లనై యుండును. ఇవియే యతని పంచేంద్రియములు, మనస్సును. అతని యంటిపెట్టుకొనియున్న గుదవలె మనసు యెట్లుగా నుండి యాకులు నీర్ష్యచేత నాకుపచ్చనై పశ్చాత్తాపములవలన గలిగిన తెల్లదనము చాలకాలము దుంపలలో నుండును.

నెస్టూర్టియమ్ :—అతని మీసాలు మొలచు నారంజిరంగు, చివరి నల్లదనము, నీ పూవు మొక్క పూవులవలె శోభించెను. ఈ మొక్క బంగారు రంగు పూలు పూచును. దాని రేకులు తుమ్మెదరెక్కలవలె నుండును.

కెబిరోజ్ :—ఇది యతని చుబుకము. ఇది యతని గడ్డమువలె పొట్టి మొక్క. ముద్దపూలు పూచును. ఏటేట నది తొందరగాఁ

బూచునది తెలుసుకొని వచ్చిన యతని గడ్డపు సొగసు దానిలోఁ గనిపించును.

హెలియోట్రోప్ :—ఇది యతని నాసిక. పూవు ఊదారంగు. పూవులో నెట్టివాగు పసపురంగు కూడఁ గలదు. లోపలి దిమ్మలు పచ్చని సన్ననివి.

అర్నీనియా :—అతని నేత్రము లీమొక్కగా జన్మించెను. ఈ మొక్క క్రమక్రమముగా మన దేశమునకు గూడ వచ్చి, దీనిని, మనము ప్రొద్దుపొడుపు పూలమొక్క యందుము. అతఁడు బ్రతికియున్నప్పుడు నిత్యము సూర్యునివంకనే చూచుచుండుటచేత దాని పూలెప్పుడును సూర్యునివంకకే తిరుగుచుండును. అతని లోతుకన్నులను సూచించుట కామొక్క పొట్టిదిగా నుండెను. అతని కన్నులు వోలె పూలు. నారింజరంగు. నల్లగ్రుడ్డిర్ష్యవలన సెఱుపు తిరుగుటచేత నాయెఱుపు పూవులోన గనిపించుచునే యుండును.

సెపానేరియా వక్కారియా :—ఇది యతని పెదవి. ఇది ప్రతియేటఁ జచ్చిపోవును. మరలఁ బుట్టును. ఇది కష్టముచేతఁ బెంచదగిన మొక్క. (Hardy Annual) ఈ మొక్క పూవుతఁగాని అతని పెదవివలెనే లేతయెఱుపు. ఈర్ష్యాదేవి దంతములు నొక్కగాఁ బుట్టిన నెత్తురుబొట్లుచిన్నిచిన్ని యెఱ్ఱని బొట్లుగా నాపూవుమీద నిప్పటికిని గన్పించుచునే యుండును. సౌందర్యవతులైన బహుకామినీభోగయోగ్య మగు నది యని కాఁబోలతని పెదవినుండి పుట్టిన యీ మొక్కపూవును ప్యారిసునగరములో స్త్రీలు మిక్కిలి గా వాడుదురు. వారికి దీనిపూవులన్నచో మిక్కిలి యిష్టమట.

అతఁడు చనిపోయిన తరువాత లోక మంతయు నతనిని గురించి పొగడెను. ఈర్ష్యాహతబుద్ధి యైనను నాత్మలో సత్పురుషుఁడైన యతడు లోకమున కీ విధముగా నుపకరించెను.

ఇప్పటికిని డయాన్థసు పూవుమొక్క యున్నచోట తోటమాలీ లెవఁడో పురుషునితో మాట్లాడుచున్నట్లు, నొకని కెదురుగా నిలుచున్నట్లూహింతు రఁట.

# పర్యాలోచనము

భావరాజు వేంకటకృష్ణరావుగారు బి. ఏ. బి. ఎల్.

ముందుచూపుతో మురిసిపోతూ ఉన్న ఆంధ్రుడు, ఒకసారి వెనుకకు తిరిగి చూస్తే బాగుండును! కాని వెనుకకు తిరిగి చూడడం అంటే ఆంధ్రునికి అపరిమితమైన దురభిమానము!

ఇరువై అయిదేండ్లనుండి ఆంధ్రులు సావకాశముగా ఆంధ్రోద్యమము సాగిస్తూ ఉన్నారు. ఆ ఉద్యమమునకు ఫలితము ఇంతవఱకు చేకూరలేదు. ఒకటి చిన్నచక్రము ఇంకొకటి పెద్దచక్రము గల బండికి జోడు కుదురని యెడ్లను గట్టి త్రోలుటకు గుడ్డివానిని బెట్టినపుడు ఆ బండి నడక ఎలాగున సాగుతుందో ఆ విధముగా నడుస్తూ ఉన్నది ఆంధ్రుల ఉద్యమము. ఎందు కీలాగున నీళ్లు నములుచున్నట్లున్నదో యీ ఉద్యమము అని, విచారణచేసి, కారణం చూపించి దిద్దగల ధీశాలి యింతవఱకూ కనబడలేదు.

జాతీయాభిమానము, దేశభక్తి, కలిగిననాడు ఆంధ్రుడు నిద్రబోతూ ఉన్న కోడెత్రాచువలె ఉండినాడు. జాతీయావేశం కలిగినపుడు తన పూర్వస్థితి స్వప్నప్రాయంగా గోచరించింది. ఒకటిన్నర శతాబ్దములో తన పూర్వస్థితి యేవిధంగా మారిపోయినదో తలచుకుని నిర్వేదమును పొందినాడు. విజయనగరసామ్రాజ్యవైభవము తలక్రిందులైపోయినా, కొంత అధికారమును నామరూపాలతో పెనుగొండలోను, తరువాత చంద్రగిరిలోను, తిరిగి తల యెత్తజేసినాడు. కాని, ఆనాటికి సామ్రాజ్యం పూర్తిగా బలక్షీణ మయిపోయింది. పోనియ్యండి, తంజాపుర, మధురరాజ్యములు వెలిగిన వంటే, ఆ దివ్యమైన వెలుగు మెఱుపువలె కౌరవమబ్బులవంటి అంతఃకలహములలో అంతరించిపోయింది. ఆంగ్లేయులు వచ్చి పూర్వాంధ్రదేశములో వర్తకం సాగించినపుడు మళ్లీ యీ ప్రాంతమును ఐశ్వర్యలక్ష్మికి లీలామందిరము చేయగల రని ఆశ పడితే, ఒకనాడు వారు అమాంతంగా సర్వస్వం దొర్లించుకుని చెన్నపట్నం వెళ్లిపోవడంచేత ఆ ఆశ అడియాస అయినది. ఆంధ్రుని కంతటితో, సర్వము నాశన మైనది. జన్మభూమి, ఉన్నచోటు, కొణాచి అన్నీ విడచిపెట్టుకొని పరరాజ్యంలో ప్రవేశించి మొదటినుంచి అంతా పునస్సృష్టి చేయవలసివచ్చింది ఆంధ్రజాతికి అంతటితో, వెన్నెముక విరిగిపోయినది. అంతటితో నేలపై చిందిన పాదరసమువలె ఆంధ్రజాతి చెదిరి పూర్తిగా కూలి యినది.

ఇట్టి ఆపత్తులో మునిగిన ఆంధ్రజాతికి మూర్ఛవచ్చిన ట్లయ్యెను మత్తు నుండి మేలుకొనునట్లు అతనిని వంగదేశీయుల జాతీయోద్యమ మేలుకొలుపులు పాడినది. ఆంధ్రుడు కన్నులు విప్పి చ[illegible] అపస్మారమున కూలినాడు. అయావేశమున కన్నులు విప్పి క[illegible] చూచి త్రాచుపామువలె సాగి బుసకొట్టినాడు. అతని యావే[illegible] సంరంభము యిరుప్రక్కల ప్రాంతాలవారికి భీతి, ఆశ్చర్యము క[illegible] కలిగించినవి. ఆ రోజులలో ఆ ఆవేశమును మత్తెక్కించిన[illegible] భింపజేసినది ఆంధ్రుల చరిత్ర. అత డద్దానిని చదివి, [illegible] గిన ఆత్మవికాసముతో ఆవేశంతో జాతీయాభిమాన[illegible]ణం పూరించి కార్యరంగమునకు తొల్లిటివీరులరీతిని ఉఱికి[illegible] [illegible]లిన ఆంధ్రజాతియం దుద్భవించిన నూతన ఉత్సాహశక్తి[illegible] [illegible]ర్థము పూర్తిగా తెలుసుకోలేకపోయినాడు. వర్షం కురిసిన [illegible] పొరలి ప్రవహించే కొండవాగులాగున, ఆంధ్రుడు

క్రుళ్లింతలాడిశాడు. ఏటి ప్రవాహమునకు అనకట్ట కట్టి నీటిని కాలవలకు, పాయలకు, మళ్లకు మళ్లించి పంటలు పండించే పూర్వపు శక్తి ఆంధ్రునికి ఆనాడు కలుగలేదు. దానికి కారణము అపస్మారములో నున్న ఆంధ్రజాతికి సంపూర్ణమైన ఆత్మవికాసమును అప్పుడు కలసిన ఆంధ్రుల చరిత్ర కలిగించలేదు. సంపూర్ణ మైన ఆత్మవికాసమును కలిగించగల ఆంధ్రదేశచరిత్ర ఆంధ్రులచరిత్ర నేటికిని మరయొకటి కలుగడలేదు.

ఆంధ్రులచరిత్ర సమగ్రంగా ఇంతవరకు ఒక్క విద్యాధికు డైన ఆంధ్రుడూ వ్రాయకపోవడం ఆంధ్రజాతి దురదృష్ట మనవలయును. నిజాంరాష్ట్రింలో ఉన్న ఆంధ్రులకు కాకతీయాంధ్రసామ్రాజ్య చారిత్రము కండ్లు విప్పారజేసినది. ఓరుగల్లుదుర్గము, హనుమకొండ రామప్పదేవాలయాదులు చూచుకొన్నప్పుడు ఆకాకతీయప్రభువుల నాటి యాంధ్రుల ఔన్నత్యము దివ్యమోహన మైన రూపము దాల్చినట్లు వారికి సాక్షాత్కార మైనది. చాళుక్యుల చరిత్ర రెడ్డిరాజుల వైభవము చదివి తెలుసుకొన్ననాడు కొండవీడు, కందుకూరు, బెజవాడ, రాజమహేంద్రవరము, దాక్షారామము, సింహాచలము మొదలయిన వాటిని చూచినపుడు, పూర్వాంధ్రసీమవారలకు ఉత్సాహం పొంగి పొరలిపోయింది. కాని రాయలసీమచరిత్ర ఎవరికి సరిగా తెలియదు. ఆంధ్రులచరిత్రయందు అది యేమీ కనబడదు. అది ఆంధ్రజాతి యొక్క దౌర్భాగ్యము. అది నిజముగా ఆంధ్రుడు దుఃఖపడవలసిన విషయము. అక్కడి ఆంధ్రులు ఇక్కడి ఆంధ్రులు ఒక్కరే—కాదు—దక్షిణమున కన్యాకుమారి వఱకూ వ్యాపించి వలసబోయిన ఆంధ్రులు సయితము, కృష్ణాగోదావరీమహానదుల ప్రాంతములనుండి వలసబోయి, విక్రమించి, జయించి, ఆక్రమించుకున్నవారి సంతతివారే! అని చరిత్రకారుడు చాటి చెప్పలేకపోయినాడు విజయనరగసామ్రాజ్యస్థాపనాచార్యుడు ఆంధ్రుడు అని గర్వసంరంభమును గలిగించి, దోహదము చేయగలిగినవాడు లేకపోయినాడు. మీదు మిక్కిలి, కలిగిన యాగర్వసంరంభమునకు అడ్డుతగులుటకు వింతపరిస్థితులు తటస్థమయినవి. ఆంధ్రకవితకు విద్యానగరవీధులందు పెండ్లిపందిళ్లు కప్పించిన ఆంధ్రభోజుడు, ఆంధ్రకవితాపితామహుని మనుచరిత్రం బందుకొనువేళ పురమేగ బంగరుపల్లకిని తన చేత యెత్తిన సార్వభౌముడు, శ్రీకృష్ణదేవరాయమహారాయలు, ఆంధ్రుల యత్యున్నతస్థితికి కారణభూతుడై యవతరించిన మూరురాయరగండడు, ఆంధ్రు డగునా కాదా యను కుశ్శంక ఈనాడు కలిగినది. రాయలసీమవారికి కాలూనుటకుకూడ అవకాశము లేకపోయినది. బమ్మెర పోతరాజువంటి ఒకమహాకవిని ఓరుగంటిసీమవారు మానాటి వాడని లాగుకొనిపోతూఉం టేనిర్విణ్ణుడై, ఈర్ష్యతో, రాయలసీమనాటి ఆంధ్రుడు ఊరకమాస్తూ గ్రుక్కిళ్లుమింగినాడు. కాని వారికి ఆంధ్ర చరిత్రకారు డొకడయినా, ఆంధ్రకవితాపితామహు డైన అల్లసాని పెద్దన, రామరాజభూషణు డైన భట్టుమూర్తి, అయ్యలరాజు రామభద్రుడు, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరన, అందరికంటె మిన్న ఆంధ్రచక్రవర్తి కృష్ణరాయకవీంద్రుడు ఆరా

యలసీమయు ట్టినవాడు! వొక విశేషం మాత్రం స్ఫుటంగా కనపడు
ఈర్ష్యను చ ట షిస్తూ ఉంటే?
లేకపోయిన
వరించుటకూ వుపంతులు గారు, ఇప్పుడు, తమ త్రివేణిపత్రిక
స్తుతమైయై పరిరేటట్టు సమకూర్చా లని సంకల్పించుకునివున్నారు.
లేకపోయిన ఉన్నప్పటితప్పకుండా పూర్తి చెయ్యకలసిం దని దేశీయు
రఘునాథభు తలచుకు అందులో సంతకం చేసినవారిలో మూడుపా
త్యాగరాజా
వదలుకో, ఆంధ్రరాష్ట్రం విడిపోయివుంటే ఆ అరవలు
సంతతివార ముండ్లనుండి? తెనుగువా రవ కేనా రాసి పట్టుకువెడితే
కారుడు ఏవిధంం చేస్తారా!
రిల్లగ దేశవా
యని తమకల్పసిద్ధి కోసమేనా పంతులుగా రిప్పుడు యీ
అనిపించలే
మాచి పరిసమాజంగానే వుంది.
ఇంతవ క్షణ కలిగిన కొన్ని చిల్లరఉద్యోగాలూ, ఒకటి రెండు ప్రా
కారం జరి న్నది. చ్చినంతమాత్రాన సంతోషించవలసిన దేనా?"
ము ఆంధ్ర
కులుగారు. ఆ ప్రశ్న యిప్పుడు మా చెవిలో
గల అష్ట
రన్న సంగ సనా.
సమానగా ఆయనే స్వక్కీ.
డిన ధీరుక ఇప్పటి చ
సంపదను ం తలకెక్కి తెనుగుటాకీల సంఖ్య పెరిగింది; కాని యో
పాలుపా
బుద్ధిపాటుపోయింది.
ననుభవిం నాడకుండపుజాతి కీసక్కుటాయిటాకీ వొక పెద్ద మచ్చ.
జాతియ కుండా ఆట్యమూ, సంగీతమూ, అభినయమూ, పాత్రౌచిత్య
క్రీములను మ చరిత్రమూ, ఫోటోగ్రాఫీ, ఆంధ్రప్రతిష్ఠ సమస్తమూ
వారికిని,
వ
నది. అ
రకర్లూ, ఫిలింయజమానులూ యీ విధ్వంసం
గూడ
గా పాటుబడ్డారు.
ఈర్ష్యే,
స్తు" చిలకమర్తి అక్ష్మీనరసింహకవిగారి పాటు
పోయిన
క్కవ.
అన్నివిధ
అందరూ డబ్బుకోసం తక్కిన సమస్తమూ విడిచి
రాయల
అనూర
సయా రయివున్న తెనుగుటాకీ లన్నీ చూడగా
సీమవా
గా పాలుపుచ్చుకోడానికి గూడా తెనుగువారు
చూపు
తోంది.
సీమవా
నిస్సహా యిలాంటి అపకీర్తి వస్తూ వుంటే రసికు అంతా
ఆంధ్రు సెలవిచ్చిన?
ములు ఆయనను గాలకు పోతోంది. కళా, కాటికి పోతోంది. ఇక
ప్రేళ్లతోప్పనుకూడా కూ?
ఐక్యభుచడానికి క్కని టాకీలు తయ్యారుచెయ్యడాని కర్తలైన
మహనక గా, యిప్పటి డైరక్టర్లంమకు తగ రని చెప్పడాని
గురుజాం వీరభద్ర మర్శకులు లేరూ?
ఉన్న రచింపిం

# హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం

ఇటీవల హిందీప్రచారసప్తాహదినోత్సవంలో దక్షిణభారత హిందీప్రచారసభవారు మాతృభాషాదినం అని వొక ప్రహసనం జరిపారు. అది వా రెందుకోసం జరిపారో అది అప్పుడే దేశీయులకు అర్థం అయింది. ఆ వుత్సవపు సభలో భారతిసంపాదకు లయిన శ్రీగన్నవరపు సుబ్బరామయ్యపంతులుగారిని కూడా వొక వక్తగా నిర్ణయించారు. ఈ గౌరవానికి మురిసి పంతులుగారు హిందీప్రచారాన్ని సమర్థిస్తా రని హిందీప్రచారసభవారు ఆశించివుంటారు ; కాని యిందుకు వ్యతిరేకం జరిగింది సుబ్బరామయ్యపంతులుగారి ఉపన్యాసంలోనుంచి. స్థలం చాలక కొన్నిభాగాలు మాత్రమే ఇక్కడ ప్రకటిస్తున్నాము.

సంపాదకుడు

నాకు పంద్రెండేళ్లుగా భారతి సంబంధం ఉండడంవల్ల తెలుగువారి రచనలతో పరిచయం బాగావుంది. వాటితత్వం తెలుసుకొనే అవకాశం అందువల్ల ఏర్పడింది. హిందీచదువుకున్న మా తెలుగువారు హిందీలోనుండి చేసిన అనువాదాలూ, తాము సొంతంగా వ్రాసిన రచనలూ హిందీసంప్రదాయాలను అవలంబించి ఉండడం స్పష్టంగా కనపడుతుంది. కొంతమంది తెలుగుమాటలు మరిచి హిందీమాటలు కలపడంకూడా కద్దు. దీనికి ఎన్నయినా నిదర్శనాలు చూపవచ్చును; చూపగలను. కాని అందు కిది కాదు తరుణము. ఇట్లా తెలుగులో తెలుగుదనం సన్నగిల్లిపోతూ వుందంటే తెలుగువారికి విచారం కలగదూ! తెలుగుమాటే ఏల? ఇతరభాషల విషయంకూడా అంతే. మాతృభాషలస్థితి యిదివరకే ఇంగ్లీషు ప్రాబల్యాన శ్రుతిమించిందన్న సంగతి అందరికీ తెలుసు. ఇప్పుడు హిందీవల్ల రాగానపడిపోతూవుంది. అందుకోసమని వారివారి మాతృభాషలను కాపాడుకోమని చెప్పడం అత్యవసరం అవుతుంది. మాతృభాషలో మంచిప్రవేశం సంపాదించుకొని దాని హృదయాన్ని కనుగొన్నవారు ఎందుకోసమయినాసరే. ఎన్ని అన్యభాషలను నేర్చుకొన్నా తమ మాతృభాషవ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోగలరు. ఇది మాతృభాషల విషయం.

ఇంక జాతీయభాష విషయం మనవిచేస్తాను. భారతదేశవాసు లందరూ ఏకజాతివారనీ. వారు ఎన్నిమతాలవారయినా ఎన్నిభాషలవారయినా సరే, వారికందరికీ భారతదేశ వ్యవహారాలు సగటున చక్కదిద్దుకోడానికి ఒక సామాన్యభాష అవసరమనీ అట్టిభాషగా ఉండతగింది హిందీ అనీ, అది స్వరాజ్య సంపాదనానికి అవశ్యమయిన ప్రధానసాధనాలలో ఒకటనీ, మనదేశ నాయకులందరూ ఏనాడో నిర్ణయించారు. వారి నిర్ణయాన్నీ, ఆ దేశాన్నీ అనుసరించి హిందీ ప్రచారసభ మొలకెత్తి ఆ భాషను వ్యాపింపచేస్తూవుంది. అఖిలభారతజాతి ఉద్ధరణంకోసం ఏర్పరుచుకొన్న ఆ హిందీభాషను, వ్యవహార జ్ఞానంకోసం నేర్చుకోవద్దని తనలోని భారతీయ రక్తం ఇంకిపోనంతవరకూ ఏ భారతీయుడూ చెప్ప[illegible]ని నా విశ్వాసం. ప్రతికూల ప్రచారంవారుకూడా అదే చెబుతున్నారు. అయితే జాతీయభాష స్థానమూ, దానికి చూపవలసిన గౌరవమూ వేరు; మాతృభాషస్థానమూ, దానికి చూపవలసిన గౌరవమూ వేరు. మొదటిది మాతృభాష, తరువాతిది జాతీయభాష. కాని ఇంగ్లీషు చదువువచ్చినతర్వాత అది తల్లకిందులయిపోయింది. గౌరవము ఆ అన్యభాషమీద కలిసిపోయింది. మాతృభాష అగౌరవాన్ని పొందుతూవుంది. ఈముప్పు కడుపుకూటికోసం వచ్చింది. ఇప్పుడిప్పుడు అన్నిభాషలవారూ తమ తప్పును తెలుసుకొంటున్నారు. దిద్దుకోవడానికి ప్రయత్నాలు సాగుతూవున్నవి: ఇంతలో హిందీవచ్చింది. మళ్లీ మాతృభాషకు మరొకపీడకలిగింది. అది తొలగిపోవడముకోసమే ఇప్పుడు హిందీ ప్రచారానికి ప్రతికూలంగా వాదాలు బయలుదేరడం. ఆయాభాషలవారు ఈహిందీప్రచారంకోసం వేలకొలదిగా ధనమునిచ్చినారుకాని తమతమ మాతృభాషలకోసమని ఏమీచేశారుకారు. ఎన్నోపరిషత్తులు, సమితులు, సంఘాలు పేరువడున్నవి గాని మాతృభాషోద్ధరణం విషయంలో అవి చేసినపనికూడా పేరుమాత్రంగానే కనపడుతూవుంది. నాపన్నెండేళ్ల అనుభవాన్నిబట్టి చెప్పతూఉన్నాను, ఈకాలంలో ఉత్పత్తి అవుతూవుండే సాహిత్యాన్ని — గ్రంథరూపమయినాసరే, వ్యాసరూపమయినాసరే చూస్తూవుంటే అది నానాటికి భ్రష్టం అవుతూవుండడం స్పష్టంగా నాకు గోచరమవుతూ ఉంది. 'హిందీ—తెలుగు' అనే వ్యాసం వ్రాసిన సంచికలోనే మా తెలుగుస్థితిని గురించి 'భ్రష్టాంధము' అనుపేర ఒకవ్యాసం వ్రాశాను. ఒక తెలుగుకే కాదు. కన్నడానికీ, అరవానికీకూడా పట్టింది యీ గతి. ఆ భాషల పరిచయం కూడా కొంత నాకుండడం మూలాన వాటిల్లో లోపం తెలుసుకోగలిగాను. ఇప్పటికైనా కన్నుతెరచి పరభాషవ్యామోహాన్ని దూరంగాపెట్టి తమతమ భాషల నుద్ధరించుకోవడ మిక్కిలి అవశ్యకమని ఆయా భాషలవారిని హెచ్చరిస్తూవున్నాన

హిందీప్రచారకులు కొందరు 'మాతృభాష అక్కరలేదు. హిం చదివితే చాలు అనికూడా ప్రచారము చేస్తున్నా' రని ప్రతివాదులు సకారణంగా నిరూపిస్తూవున్నారు. హిందీ ప్రచారకు లట్లాచేయుడం అన్యాయం అనకతప్పదు. ఇంకొక విషయం. హి ప్రచారసభ తాను ప్రచారం చేయుడంలో అర్థంవుంది. తన బరు తగ్గించుకోవడానికని—సభవారు హిందీవ్యాప్తికోసం అనవచ్చు ఎట్లయినా ఫలం ఒకటే కేండి—ప్రారంభ పాఠశాలలనుండి శాలలవరకు అన్ని తరగతుల పాఠశాలలోనికి హిందీని ఎక్కి చవలెనని బాగా ప్రయత్న ప్రచారాలు చేస్తూవుంది. కొన్నింట్లో ప్రవేశం కలిగింది కూడా—నియత విషయంగా అవునో కాని ఐచ్ఛికవిషయంగా మాత్రం అగును. కళాశాలలలోన అయితే సహింపవచ్చును గాని ప్రాథమిక మాధ్యమిక ఉన్న శాలలలో హిందీ ప్రవేశము దుస్సహం. నేటి పాఠశాలలో భారతీయసంప్రదాయానికి విరుద్ధమయింది. అది స్వతంత్రత పనికిరానిది. అట్లాటి పాఠశాలలలో ఎంతోసామర్థ్య వ్యా

ఎంతోకాలము చదివి ఉన్నతపరీక్షలలో ఉత్తీర్ణులయినవారికి గూడ ఎందులోనూ, ఎందుకుగాని పనికివచ్చేటంత ప్రవేశం లేకపోవడం మనకు అనుభవసిద్ధము. ఈమాత్రానికోసం మనపిల్లలు అనావశ్యకాలయిన అనేకవిషయాలను పాఠశాలలో చదవడం అనివార్యమవుతూవుంది. వాటికితోడు హిందీని ఒకదానిని వారికి క్రొత్తగా నెత్తికెక్కించడం అనాలోచితమైనపని. అనావశ్యకాలయిన విషయాలను చదవడంచేత కృశించి కొయ్యబారుతూఉండే పిల్లల మృదువైన మెదడును రాయిపారచేయడం అవుతుందికాని దానికి చైతన్యాన్ని ప్రసాదించి వికసింపజేయడం ఎన్నడూకాదు. ఇట్లా హిందీని చేర్పవలెనన్నకోరిక ఉన్నపుడు అనావశ్యకాలయిన వాటిలో దేనినైనా మాన్పించగలిగినారా? మన కది సాధ్యమా? అస్వతంత్రులకు అది ఎట్లాసాధ్యం అవుతుంది? కాబట్టి యిప్పటి స్థితిలో హిందీని పాఠశాలల్లో ప్రవేశపెట్టడం మిక్కిలి పొరపాటు. ఎన్నియేండ్లు ఎన్నివిధాలుగా ప్రచారప్రయత్నాలు చేసినా ఇతర భాషలవారెన్నడునూ హిందీభాషవారు కాబోరు. ఎన్నివిధాల పాడయినా తమతమ భాషలనే ఆయాప్రాంతాలవారు వాడుకోక తప్పదు. కాబట్టి హిందీప్రచారం ఒకహద్దుకు అవలనుండియే జరగవలెను. అపుడు దానికి దెబ్బతగలదు. అంతవరకూ ఉపద్రవం తప్పదు దానికి.

నేను తెలుగువాడను; తెలుగునుగురించి మాట్లాడుతూవున్నాను. మా తెలుగువారికీవిషయంలో కొంత సలహాయివ్వడం అవసరం. ఇప్పుడు హిందీవచ్చినవారన్న అరున్నర లక్షమందిలో మా తెలుగువారి సంఖ్య తక్కిన భాషలవారి సంఖ్యకంటె హెచ్చు, ఇందులోనే కాదు, సత్యాగ్రహముల్లో, జైళ్ళకు పోయినవాళ్ళల్లో, ఇతరదేశీయ కార్యాలు చేసినవారిలో ఈ దక్షిణభారతంలో ఇతరప్రాంతాల వారికంటె మా తెలుగువారి సంఖ్యే అధికము. ఎక్కువ కష్టనష్టాలకు పాలయినవారూ వారే. పొంగు ఎక్కువగలవారు మావారు. ముందు వెనుకచూచే స్వభావంలేదు మావారికి. ఏ ప్రాంతం వాడయినా సరే 'దూకండి' అని నిప్పులగుండాన్ని చూపితేచాలు—వాడు ఎట్లాగూ దూకడుకదా, తుదకు దానిదగ్గరకయినా రావక్కరలేదు. మావారు కండ్లుమూసుకొని దూకి కాలిపోతారు. దేశసేవాధురంధరులని అందరూ పొగడుతూ వుంటే వుబ్బిపోతారు. ఏ పెల్లువ దేశాన్ని అలుముకొనివచ్చినా ముందు దానిలోపడి కొట్టుకుపోయేవారు మావారు. ఏశక్తి దేశాన్ని మ్రింగజూచినా మొదటికబళం మావారే. లాభంవుండే కార్యాల్లో మావారికి కడబంతిలో కడపటనైనా స్థానం ఉండడం కష్టం. ఇదంతా అందరికీ బాగా తెలిసిందే. ఇంక అమాయకంగా ప్రవర్తించడం ఎంతో అపాయకరమనీ, పొంగు ఎప్పుడూ పనికిరాదనీ, తాము చేయదలంచిన ప్రతిచిన్నకార్యాన్ని అణువు అణువుగా చక్కగా పరిశీలించి గుణదోషాలను నిర్ణయించి ఆత్మగౌరవప్రతిష్ఠలకు భంగం కలుగకుండా ఆత్మోద్ధరణానికి, అన్యోన్యస్థితికి ఏమాత్రమైనా ఉపకరించేటట్లయితేనే చేయవలసిందని మావారిని కోరుతాను. ముఖ్యంగా ఈ హిందీ నేర్చుకొనేవిషయంలో అట్టివారు చాల జాగ్రత్తపడి మాతృభాషను బాగా అధ్యయనంచేసి తర్వాత హిందీని వ్యవహారమాత్రజ్ఞానం కలిగేమాత్రంగా—హిందీలో పరీక్షలు అక్కరలేదని నా యభిప్రాయం—చదువవలసిందని హెచ్చరిస్తాను. ఇంతేకాకుండా మాతృభాషాభివృద్ధికోసం సాధ్యమైనంతప్రచారాన్ని చేస్తూ విద్యావిహీనులగు తమ సోదరాంధ్రులు విద్యావంతులై, వారును సర్వకార్యములయందును తమకు చేదోడువాదోడుగ నుండునట్లు చేసికొందురు గాక యని కోరుతాను.

---

## వసంతకుసుమాకరము

మధుమేహము, అతిమూత్రము, రాచకురుపులు, శుక్రక్షయము, శుక్రనష్టము, బలహీనత, చిరకాలపు తెల్లకుసుమ, మేహవ్యాధులు జీర్ణించుట ౹ కలుగు సకలమూత్రసంబంధవ్యాధులకు ప్రసిద్ధికెక్కిన రాజౌషధము. తులము రు 20—0—0.

## సిద్ధమకరధ్వజము

ఇందు బంగారు కలదు. పూచీ యివ్వబడును.

జగత్ప్రసిద్ధమగు బలవర్ధకౌషధము. రక్తక్షీణము, వీర్యదోషము, నపుంసకత్వము, క్షయ, శ్వాసకాసలు, నరముల బలహీనత, కుష్ఠు రోగములు, మొదలగువానికి దివ్యౌషధము.

తులము 24—0—0. 60 మాత్రలు రు 10—0—0

## ఏకోత్తరవృద్ధి మహాలక్ష్మీ విలాసరసము

## చ్యవనప్రాశము

క్షయరోగులకు అమృతోపమానములగు ఔషధములు

చిరకాలము క్షయవ్యాధిచే పీడింపబడుచు శల్యావశిష్టముగ నుండువారలకు నూతనయౌవనమును ఆరోగ్యమును కలిగించును. క్షయ శ్వాసకాసలు ఉబ్బసము కఫముతో కలసి రక్తముపడుట, రక్తహీనత, శరీరకృశత్వము, హృదయదౌర్బల్యము దీర్ఘకాలము నుండి బాధించు మొండిదగ్గులు మొదలగునవి జయించును. బలము, కాంతి శుక్రమును వృద్ధిచేయును.

రెండుఔషధములు కలిపి సేవించవలెను.

నెలకు రు 18—12—0.

## స్వర్ణక్రవ్యాదరసము

చిరకాలాజీర్ణములకు మంచిది. కడుపుబ్బరము, శూల, గుల్మము, యకృత్ ప్లీహ వృద్ధులు మొదలగునవి జయించును. బలవర్ధకము తులం రు 4—0—0.

చిరునామా:—వేంకటేశ్వర ఆయుర్వేదనిలయము హెడ్డాఫీసు.—చింతలూరు, ఆలమూరుపోష్టు, తూర్పుగోదావరిజిల్లా

---

బ్రాంచిలు:—1. కాకినాడ, 2. రాజమండ్రి, 3. పెద్దాపురం, 4. అనకాపల్లి, 5. విశాఖపట్టణం, 6. ఏలూరు, 7. అమలాపురం, 8. తుని, 9. రామచంద్రపురం.

☞ ఏలూరు బ్రాంచిలో చికిత్సకులు

వైద్యవిద్వాన్ కూచిభొట్ల వెంకటేశ్వర్లుగారు.

## పుట్టుమచ్చలు

పుట్టుమచ్చల గుణతత్వాలు సహేతుకాలుగా చర్చింపబడ్డా యీ పుస్తకంలో. ఈ పుస్తకం చదివి ఇందలి వివిధాంశములను అందరునూ గ్రహించుట మంచిది. ఇందులో విశేషాంశము లెన్నియో గలవు.

వెల రు. 1—0—0 మాత్రమే

కొలదిప్రతులే ఉన్నవి. త్వరగా ఆర్డర్లు పంపండి.

## చేయి

ఇదియొక అద్భుత సాముద్రిక గ్రంథము. సాముద్రికమున నమ్మకమున్నవారును లేనివారునుకూడ దీనిని చదివి గ్రహించవలసిన అనేకములయిన అంశములిందు పొందుపరుపబడినవి. చదివి లాభమందవలసిన గ్రంథము.

గ్రంథకర్త పూడిపెద్ది వెంకటరావు

వెల రు. 1—0—0 మాత్రమే

## హస్తనిర్మాణం

ఇదియొక ఉత్తమమయిన సాముద్రిక గ్రంథము. దీనిలో హస్తనిర్మాణమునగల విశేషములు, వ్రేళ్లు, వ్రేలి కణుపులు, వ్రేలి మడుపులు, గోళ్లు, హస్తమండలములు, వాని అధిష్ఠానగ్రహములును, వానివాని తత్వములును, గుణములు, ఫలితములు మున్నగునవెన్నియో ఇందు విపులముగ చెప్పబడినవి. చదివి చూడండి.

వెల రు. 1—0—0 మాత్రమే

ఈ మూడు పుస్తకములును ఒకేసారి తెప్పించుకొనువారికి తపాలాఛార్జి లేదు.

*For Copies Apply to:—*

**Pudipeddi Venkata Rao,**
Palmist & Occultist
VIZIANAGARAM CITY.
B. N. RY.

ఈ గ్రంథములు రాజమండ్రిలో కలాభివర్ధనీపరిషత్తులోను దొరకును.

# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రముపీధి ✻✻✻ రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్క చక్కని నవల. నడుమ నడుమ చిన్న చిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0–4–0 చందాదారులు ఒకేసారి రు 7–8–0 ను ముందుగా పంపినచో వరుసగా ఆరుపుస్తకములు అన్‌రిజిస్టర్డు పార్శిలుగా పంపుదుము.

ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 11 | ప్రేమసుందరి | 1 | 8 | 0 |
| 12 | చోరశిఖామణి | 1 | 8 | 0 |
| 13 | లక్ష్మీప్రసాదము | 1 | 8 | 0 |
| 14 | హాస్యారహస్యము | 1 | 8 | 0 |
| 15 | ఫాస్టు (1 భాగము) | 1 | 8 | 0 |
| 16 | ఫాస్టు (2 వ భాగము) | 1 | 8 | 0 |
| 17 | కుముద్వతి | 1 | 8 | 0 |
| 18 | చిన్నకోడలు | 1 | 8 | 0 |
| 19 | రహస్యభేదనము | 1 | 8 | 0 |
| 20 | సింహగడము | 1 | 8 | 0 |
| 21 | మణిహారము | 1 | 8 | 0 |
| 22 | మొగలాయిదర్బారు (1 వ భాగము) | 1 | 8 | 0 |
| 23 | ఘటనాచక్రము | 1 | 8 | 0 |
| 24 | రాజసుందరి | 1 | 8 | 0 |
| 25 | కుంకుమభరణి | 1 | 8 | 0 |
| 26 | జాగిలము | 1 | 8 | 0 |
| 27 | మొగలాయిదర్బారు (2 వ భాగము) | 1 | 8 | 0 |
| 28 | సరస్వతి | 1 | 8 | 0 |
| 29 | ఆనందాభాయి | 1 | 8 | 0 |
| 30 | హాస్యాన్వేషణము | 1 | 8 | 0 |
| 31 | మొగలాయిదర్బారు (3 వ భాగము) | 1 | 8 | 0 |
| 32 | XoX | 1 | 8 | 0 |
| 33 | మొగలాయిదర్బారు (4 వ భాగము) | 1 | 8 | 0 |
| 34 | కోహినూరు | 1 | 8 | 0 |
| 35 | ఆటీన్ మజేలా | 1 | 8 | 0 |
| 36 | అపరిచిత | 1 | 8 | 0 |
| 37 | అంతఃపురము 1 భా॥ | 1 | 8 | 0 |
| 38 | అంతఃపురము 2 భా॥ | 1 | 8 | 0 |
| 39 | అగ్రహారము | 1 | 8 | 0 |
| 40 | ఛిన్నహస్తము 1 భా॥ | 1 | 8 | 0 |
| 41 | ఛిన్నహస్తము 2 భా॥ | 1 | 8 | 0 |
| 42 | కంకణరహస్యము | 1 | 8 | 0 |
| 43 | సంజీవి 1 భా॥ | 1 | 8 | 0 |
| 44 | సంజీవి 2 భా॥ | 1 | 8 | 0 |
| 45 | వజ్రరాణి | 1 | 8 | 0 |
| 46 | హాస్యాశ్రమ | 1 | 8 | 0 |
| 47 | కాశీఖండము | 1 | 8 | 0 |
| 48 | సేవాశ్రమము 1 భా॥ | 1 | 8 | 0 |
| 49 | సేవాశ్రమము 2 భా॥ | 1 | 8 | 0 |
| 50 | దాసీకన్య | 1 | 8 | 0 |

## అనుబంధములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మృత్యురంగిణి | 0 | 12 | 0 |
| 2 | అభాగిని | 0 | 12 | 0 |
| 3 | ఛద్మవేషి | 0 | 12 | 0 |
| 4 | విదురుని యుపదేశములు | 1 | 0 | 0 |
| 5 | కాంచనమాల | 1 | 0 | 0 |
| 6 | సీమంతిని | 1 | 0 | 0 |
| 7 | సుశీల | 1 | 0 | 0 |
| 8 | శశిరేఖ | 1 | 0 | 0 |
| 9 | యమునాబాయి | 1 | 0 | 0 |
| 10 | శ్యామల | 1 | 0 | 0 |
| 11 | కాంతంకథలు (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| 12 | కాలసర్పి | 1 | 0 | 0 |
| 13 | భారతకథాసారం | 1 | 0 | 0 |
| 14 | కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| 15 | అరక్షణీయ | 1 | 0 | 0 |
| 16 | మాధవి | 1 | 0 | 0 |
| 17 | లలిత | 1 | 0 | 0 |
| 18 | పెండ్లిదండ | 1 | 0 | 0 |
| 19 | కథావళి | 1 | 0 | 0 |
| 20 | నాలుగుకథలు | 1 | 0 | 0 |
| 21 | నీతిప్రబోధిక | 1 | 0 | 0 |
| 22 | ఆదర్శము 1 భా॥ | 0 | 12 | 0 |
| 23 | ఉదంకుడు | 0 | 12 | 0 |
| 24 | భేతాళకథలు | 0 | 12 | 0 |

## నాటకములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మార్కండేయ | 0 | 12 | 0 |
| 2 | అహల్యాశాపవిమోచనము | 0 | 12 | 0 |
| 3 | మీవారుపతనము | 1 | 0 | 0 |
| 4 | వరమాల | 1 | 0 | 0 |
| 5 | షాజహాను | 1 | 0 | 0 |
| 6 | నూర్జహాను | 1 | 0 | 0 |
| 7 | దుర్గాదాసు | 1 | 0 | 0 |
| 8 | చంద్రగుప్త | 1 | 0 | 0 |
| 9 | దంపతులు | 1 | 0 | 0 |
| 10 | విజయవిజయం | 1 | 0 | 0 |
| 11 | భక్తకుచేల | 1 | 0 | 0 |

 ఈ గ్రంథములు రాజమండ్రిలో కళాభివర్ధనీ పరిషత్తులలోను దొరకును.

సరస్వతీ పాకెట్ డిక్ష్నరీ యొక్క ఒక నమూనా పుట :—



Garment–*n.* మనుష్యులలోని ఏదేనివస్త్రము, బట్ట
Garner–*n.* ధాన్యము నిలువ పోయు కొట్టు; *v. t.* నిలువ పోయు, కూడబెట్టు
Garnet–*n.* కెంపురంగుగాజు రాయి
Garnish–*v.t.* అలంకరించు; *n.* అలంకారము; *also n.* Garnishment
Garret–*n.* మిద్దెగది
Garreteer–*n.* మిద్దెగదిలో వసించువాడు
Garrison–*n.* కోటలో నుండు రక్షణసేన; *v. t.* రక్షణ సేననుంచు
Garrote (-tte)–*n.* ఉరితీయు చంపుపద్ధతి; ఇట్టి పద్ధతిలో కూడిన స్పెయినుదేశపుమరణ శిక్ష; *v. t.* ఉరితీసి చంపు గొంతుక పిసికి దోచుకొను
Garrulous–*adj.* అధిక ప్రసంగియైన
Garter–*n.* మేజోడు దిగజారకుండ నుంచెడు నాడా; *v. t.* ఇట్టి నాడాతో కట్టు
Gas–*n.* వాయువు; కట్టికబుర్లు డాబుమాటలు, గప్పాలు; *v. t.* వాయువునకు సమకూర్చు; విషవాయువును వదలిచంపు;
*v. i.* కట్టికబుర్లు లేక డాబులు చెప్పు
Gaselier–*n.* పలుదీపముల కొమ్మలుగలిగి వ్రేలాడునట్టి దీపము
Gaseous–*adj.* వాయురూపమున నున్న
Gash–*v. t.* లోతుగ కోయు; *n.* లోతుగ తెగిన పొడవైన గాయము
Gas-light–*n.* వాయు పదార్థమున వెలిగెడు కాంతిగల దీపము
Gasp–*v. i.* & *v. t.* ఊపిరి తీయుటకు నోరు తెరచు; *n.* ఎగఊపిరి
Gasping–*adj.* ఎగఊపిరి గానున్న; *n.* ఎగఊపిరి
Gassy–*adj.* వాయుపూర్ణమైన; వాయువువంటి
Gastric–*adj.* కడుపు సంబంధమైన; Gastric juice జీర్ణద్రవము; జఠరద్రవము
Gastrology–*n.* పాకశాస్త్రము. hence Gastrologist & Gastrologer *n.*
Gastronomy–*n.* రుచులనెరింగి భుజించుశాస్త్రము; తిండిపోతుతనము
Gate–*n.* బహిర్ద్వారము;

☛ సరస్వతీ ఇంగ్లీషు–తెలుగు పాకెట్టు డిక్ష్నరీ

*Saraswathi English-Telugu*

POCKET DICTIONARY.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి.

క్రౌను సాకెట్టు సైజు——665 పేజీలు
సుమారు 17000
ఇంగ్లీషు పదములకు సులభముగను
తెలుగు అర్థములు—కూడా నిచ్చి
ఒక దిక్కుగ యుంచబడినది.
పక్కా బైండింగు.
వెల ప్రతి 1 కి రు 1-8-0

అచ్చులోనున్నది!

# వస్తుగుణ ప్రకాశిక

సరస్వతీ పవర్ ప్రెస్ వారి ప్రచురణము, రాజమండ్రి.
మంచిగ్లేజు కాగితము! సొగసైన క్యాలికో బైండు!! పుస్తకములో వస్తుగుణప్రబోధముగల పేజీలు 1000 పైగా నుండును. వెల ప్రతి 1 కి 5-0-0

ఇది సమస్తద్రవ్యగుణములను అసందిగ్ధముగ తెలియజేయు అపూర్వగ్రంథ రాజము. ఆంధ్రవైద్యలోకమునకు, వైద్యతరులకును మిక్కిలి యుపయోగకర మగునటుల బ్రహ్మశ్రీ ఆయుర్వేదభూషణ భిషగ్వర పండిత పీటూరి వాసుదేవ శాస్త్రి, ఏ. యం. ఏ. సి. గారిచే వ్రాయబడినది. ఇందు సందిగ్ధద్రవ్యములన్నియు నిర్ధారణ చేయబడి ప్రచురింపబడినవి. నానాదేశౌషధద్రవ్యములు చేర్చబడినవి. వస్తువునందలి రసవీర్యవిపాకప్రభావములను గుణములను విడదీసి వస్తు ప్రాధాన్యము నిరూపింపబడినది.

**చిత్రమూలము** :—చిత్రిక - అగ్ని — Plumbago zeylanica. ఎఱ్ఱని చిత్రమూలము— Plumbago R oea.

**స్వరూపము**

ఇది రమారమి 2 గజముల యెత్తువరకును బెరుగును. ఇది క్షుపజాతిలోనిది. దీని కాండము సాఫుగా నుండును. ఆకులు చిన్నశమురపాకులను బోలి యుండును. వానికంటె కొంచెము గుండ్రముగా నుండును. ఆకులు విడివిడిగా నుండును. దీని కుత్తెణువంటి వెన్నులు బయలుదేరును. నక్కిరికాయలవలె నవి బట్టలకు పట్టుకొనును. వేరు పొడవుగను చిదుగగొట్టిన పసుపురంగుగను యుండును. దీనిలో ఎఱుపు, తెలుపు, పసుపుపచ్చరంగుల భేదముతో మూడు జాతులు కలవు. పూవుల రంగులబట్టియు, కాండముయొక్క స్వల్పమగు రంగును బట్టియు జాతిని నిర్ణయించుకొనవలయును. దీని యితరాంగములకంటె వేరునకే ప్రాశస్త్యము కలదు.

**గుణములు**

దీనివేరు మిక్కిలి కారపురుచి గలది. వేడిచేయు స్వభావము గలది. విపాకమునగూడ కారపురుచిగనే యుండును. వాతకఫములను పోగొట్టును. వాతోదరమును, గ్రహణీరోగమును, మూలశంకలను నిర్మూలించును. పాండురోగమును, క్షయయును హరించును. క్రిములను, దురదలను బోగొట్టును. ఎర్రచిత్రమూలమునకును, నల్లచిత్రమూలమునకున్ను యించుమించుగ నివియే గుణములుకాని కొన్ని విశేషగుణములుకూడ కలవు. ఈ రెండును గూడ రసమును బంధించును. లోహస్వర్ణీకరణమునందుగూడ వాడుదురు. నల్లచిత్రమూలమునకు వెండ్రుకలను నల్లపరుచు గుణముకలదు. పాలలో వేరు వేసిన పాలు నల్లబడునని కూడ చెప్పుదురు. మొత్తమున నీ రెండును అమూల్యద్రవ్యములు.

**ప్రయోగములు**

ఉబ్బులకు :— చిత్రమూలవు ఆకులు తరిగి కూరగా వండిపెట్టిన ఉబ్బులు తగ్గును. (వంగసేన, శోధ. చి.)

గ్రహణికి :—చిత్రమూలము పెద్దముల్లకలరయొక్క క్షారమును వారమురోజులు స్రవింపజేసి పిమ్మట దానిని దీసి దానికి రెండురెట్లు ఆవునేతిలో కలిపి వాని ఘృతపాకముగా కాచి సేవించిన జఠరదీప్తిని కలిగించి గ్రహణీరోగమును నివారించును.

మేదోరోగమునకు :—చిత్రమూలముయొక్క వేరు చూర్ణము తేనెతో సేవించుచు హితభోజనుడై యున్న మేదోరోగములు హరించును. (వంగసేన, మేదోధికారమున)

శోథకాలునకు :—చిత్రమూలపు వేరు ముద్దగాని, దేవదారుగాని లేక రెండును గాని పైన లేపనము జేసిన గుణకారిగా నుండును.

రసాయనార్థం :—నలుపు యెఱుపురంగులు గల చిత్రమూలములలో దేనిని గాని వేరుతీసి నీడను యెండించి చూర్ణమును జేసి ఆచూర్ణమును నేతితోగాని లేక నెయ్యి తేన కలిపిగాని లేక పాలతోగాని అరిమును లేకచో నీళ్లతోగాని యొక మాసమురోజులు సేవించి హితాన్నాశనుడగువారు రోగములు లేకుండ నిస్సంశయముగా నూరు సంవత్సరములు జీవించును. మంచినూనెతో తీసుకొనిన దుస్తరమైన వాతములను గూడ హరించును. గోమూత్రముతో సేవించిన అసాధ్య కుష్ఠరోగములును, బొల్లియు నివారణమగును. మజ్జిగతో త్రాగిన మూలశంఖలు మొదలగు గుదరోగము లన్నియు హరించును. (వాగ్భటము 36. అ. ఉ. స్థానము)

మూలశంఖలకు :—చిత్రమూలమును, శొంఠియు కలిపి సీధుమద్యముతో పానము జేసిన మూలశంఖలు హరించును. (చరకము)

కఫకాసలకు :—చిత్రమూలపు వేరును, తెల్లబాడిసవేరును బెరడులను మాత్రమే గ్రహించి నీళ్లతో నూరి రసముతీసి పొంగించి దానితో తేన కలిపి యిచ్చిన దారుణములైన కఫకాసలు శమించును. చిత్రమూలపు వేరు వంటికి తాకిన నిప్పువలె పుండగును. చిదుగని వ్రణములను గాని గ్రంథులనుగాని పుండగుటకై చిత్రమూలమును పైన రాయుదురు. చిత్రమూలమును గర్భిణీస్త్రీలకు వాడకూడదు. గర్భస్రావమును గలిగించును. పైన లేపనము [illegible] వలన పక్వము గాని వ్రణములు [illegible] యు, పక్వవ్రణములు చి[illegible] [illegible]మను.

# అమృతాంజనము



అన్ని నొప్పులను

బాధలను కుదుర్చునని

<u>తమకు తెలియును</u>

<u>అయిన తెలియవలశిన దేది !</u>

నేడు దేశమంతటను కుక్కగొడుగుల వలె తలలెత్తిన నకలు మందుల చూచి మోసపోకుండుటయే !




మంచ

బజారులలో కొనుటకు పూర్వము మా ట్రేడు మార్కు గుర్తులన్నిటిని జాగ్రత్తగా పరిశీలించుడు.

ఇది నమస్త్రద్రవ్యగుణముల
తెరులకును మిక్కిలి యుపయో
శాస్త్రి, ఏ. యం. ఏ. సి. గారిచే ప్రా
మాణిక శోధన ద్రవ్యములు చేర్చబడినవి.
పారిధాన్యము నిరూపింపబడినది.

Reg. N. M. 3048 PRABUDDHANDHRA

# ఆధునికాంధ్రవాఙ్మయము

మా వద్ద నవీన కవుల గ్రంథాలన్నీ దొరకును. రూపాయకు తక్కువ ఖరీదు పుస్తకాలు వి.పి.గా పంపము. పోస్టుఖర్చులు కొనువారే భరించాలి

**శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| వీరపూజ—చరిత్ర | ౦ | ౧౨ |
| రక్షాబంధనము—డిటెక్టివ్ నవల | ౧ | ౦ |
| శ్మశానవాటిక—డిటెక్టివ్ నవల | ౦ | ౧౨ |
| మిథునానురాగము—చారిత్రక నవల | ౧ | ౦ |
| అనాథబాలిక—సాంసారిక నవల | ౦ | ౬ |
| వారకాంత—నాటకము | ౦ | ౧౨ |
| విజయనగరరాజుల కథలు | ౦ | ౨ |
| చిక్కూరురాజుల కథలు | ౦ | ౩ |
| ఢిల్లీచక్రవర్తుల కథలు | ౦ | ౩ |
| గోల్కొండనవాబుల కథలు | ౦ | ౨ |
| శృంఖల—విమర్శ గ్రంథము | ౦ | ౧౨ |

**డా. చిలుకూరి నారాయణరావుగారివి**

| | | |
|---|---|---|
| జర్మనీదేశపు విద్యావిధానము | ౧ | ౦ |
| ప్రాచీన విద్యాపీఠములు | ౧ | ౪ |
| అంబ—లేక మెండిశిఖండి—నాటకము | ౧ | ౪ |
| సంస్కృత లోకోక్తులు | ౧ | ౦ |
| ఆశ్వత్థామ—అచ్చి—౨ నాటకాలు | ౦ | ౧౨ |
| అశోకుని ధర్మశాసనములు | ౨ | ౦ |
| ఉమార్ ఖయ్యామ్—రుబాయత్ | ౦ | ౮ |
| ఉపనిషత్తులు | ౦ | ౬ |

**చింతా దీక్షితులుగారివి**

| | | |
|---|---|---|
| శబరి—కోతినాటకము | ౧ | ౦ |
| ఏకాదశి—౧౧ చిన్నకథలు | ౦ | ౧౨ |
| పరిణామవాదము—తిన్నిదర్శనములు | ౦ | ౧౨ |

**గుడిపాటి వేంకటాచలంగారివి**

| | | |
|---|---|---|
| మాకర్మమిట్లా కాళింది | ౦ | ౧౨ |
| బిడ్డలశిక్షణ | ౦ | ౮ |

**నోరి నరసింహశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| గీతమాలిక | ౦ | ౧౨ |
| సోమనాథ విజయము | ౦ | ౧౨ |
| భాగవతావతరణము | ౦ | ౮ |

**జనమంచి వేంకటరామయ్యగారివి**

| | | |
|---|---|---|
| నవకుసుమాంజలి—ఖండకావ్యసంపుటి | ౧ | ౪ |
| మాలతీమాధవము—నాటకము | ౦ | ౧౨ |
| రాజశేఖరునివిద్ధసాలభంజిక నాటకము | ౦ | ౪ |

**శ్రీపాద కామేశ్వరరావుగారివి**

| | | | |
|---|---|---|---|
| చంద్రగుప్త | నాటకము | ౧ | ౪ |
| భారతరమణి | డిటో | ౧ | ౦ |
| రాణాప్రతాపసింహ | డిటో | ౧ | ౪ |
| శివాజీశీలము | డిటో | ౧ | ౪ |
| లీలావతీసులోచనలు | డిటో | ౧ | ౦ |
| బిల్వమంగళ | డిటో | ౧ | ౦ |
| శ్రీమాధవాచార్యవిద్యారణ్య | | ౧ | ౦ |
| చిత్రకృష్ణ | డిటో | ౧ | ౦ |
| ఒకపెగ్గు | డిటో | ౧ | ౦ |
| పునర్వివాహము | డిటో | ౧ | ౦ |
| తగినశాస్తి | డిటో | ౧ | ౦ |
| సంభాజీనిర్యాణము | డిటో | ౧ | ౦ |
| కళాపాహాడ్ | డిటో | ౧ | ౦ |
| సాహిత్యమీమాంసవిమర్శగ్రంథము | | ౧ | ౮ |
| నాటకవిమర్శ | డిటో | ౨ | ౦ |
| కొత్తల్లుడు | ప్రహసనము | ౦ | ౪ |
| పిసినిగొట్టు | డిటో | ౦ | ౪ |
| జగన్నాథమాహాత్మ్యము—ప్రబంధము | | ౦ | ౧౨ |

**బరంపురం కళాప్రచారక సమితివారివి**

| | | |
|---|---|---|
| రాయబారము—మొదటిసంపుటము | ౧ | ౦ |

**జయంతీపురం జమీందారుగారివి**

| | | |
|---|---|---|
| భారతదేశపురైట్లు | ౦ | ౧ |

**మల్లంపల్లి సోమశేఖరశర్మగారివి**

| | | |
|---|---|---|
| అమరావతీస్తూపము | ౦ | ౧౨ |

**విశ్వనాథ సత్యనారాయణగారివి**

| | | |
|---|---|---|
| వేనరాజు | ౧ | ౦ |
| అనార్కలీ | ౧ | ౦ |
| కిన్నెరసానిపాటలు | ౧ | ౦ |
| ఆంధ్రప్రశస్తి | ౧ | ౦ |
| ఏకవీర | ౧ | ౦ |

**మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| పాలవెల్లి | ౦ | ౮ |
| తేనెపట్టు | ౦ | ౮ |
| ఉదంకుడు | ౦ | ౧౨ |
| విరిసెజ్జ | ౦ | ౮ |

**పూలతోట గ్రంథమాలవారివి**

| | | |
|---|---|---|
| వేయిస్తంభాలగుడి శాసనము | ౨ | ౦ |
| మల్లికార్జునరావు, సాంఘికనవల | ౦ | ౧౦ |

**దిగవల్లి వేంకటశివరావుగారివి**

| | | |
|---|---|---|
| ఇంగ్లీషు తెనుగు పారిభాషికఘంటువు | ౨ | ౮ |
| అధినివేశస్వరాజ్యం (పాదప్రతి) | ౦ | ౮ |
| సహకారవస్తునిలయోద్యమము | ౧ | ౦ |
| భారతదేశస్థితిగతులు | ౦ | ౨ |

**బసవరాజు అప్పారావుగారివి**

| | | |
|---|---|---|
| గీతములు | ౦ | ౮ |

**విజ్ఞానచంద్రికామండలివారివి**

| | | |
|---|---|---|
| లక్ష్మణరాయవ్యాసావళి ౧ భాగము | ౨ | ౦ |
| కృత్రిశాస్త్రము | ౨ | ౪ |
| పాతాళభైరవి | ౧ | ౪ |
| రాయమామయుద్ధం | ౧ | ౪ |
| కందుకూరి వీరేశలింగంపంతులుగారి స్వీయ చరిత్ర ౨ వ భాగము | ౧ | ౧౦ |
| అమెరికాసంయుక్తరాష్ట్రాలు | ౧ | ౮ |
| అల్లావుద్దీన్ అక్బరు | ౧ | ౧౪ |
| దక్షిణాఫ్రికా | ౨ | ౦ |
| హిందూమహాయుగము | ౧ | ౪ |
| హైందవచక్రవర్తుల జీవితములు | ౦ | ౪ |
| తురుష్క—ప్రజాస్వామికము | ౧ | ౦ |

**మారేపల్లి రామచంద్రశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| బిల్హణీయం | ౦ | ౮ |
| పారిజాతాపహరణం | ౦ | ౮ |
| కథారత్నాకరం | ౦ | ౧౦ |

**సీరము సుభద్రయాంబగారివి**

| | | |
|---|---|---|
| కురుచీవిజయము | ౦ | ౮ |

**పురాణం సూరిశాస్త్రిగారివి**

| | | |
|---|---|---|
| నాట్యోత్పలము | ౧ | ౦ |
| నాట్యాలోకము | ౧ | ౦ |
| విమర్శపారిజాతము | ౧ | ౦ |
| ఆంధ్రనాటకసంస్కరణము | ౦ | ౪ |

కలయువారు : కలాభివర్ధని పరిషత్తు. కలబరగి వారి యింట్లో, ఇన్నీసుపేట రాజమండ్రి అని రాసికోవాలి.

రాజమహేంద్రవరం : శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రితమై
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ప్రకటింపబడినది. ౯౬౦౫—౧౯౩౫

# విన్నపము.

...శయా,

ఈ సంచికతో తమ చందా ముగిసినది. తమ సాయం ప్రబుద్ధాంధ్ర నిశ్చింతిగా వొక సంవత్సరం గడిపింది. ...వొక సంవత్సరం చందా యిచ్చి పత్రికను పోషించ ...తున్నాను.

...ద్ధాంధ్ర ఆఫీసు, రాజమండ్రి.

ఇట్లు,
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

శ్రీ కృష్ణాప్రెస్, రాజమండ్రి.